# చందమామ

# మనసంస్కృతిని తెలుసుకోండి పోటీ

## రూ.100,000 పైగా విలువగల బహుమతులు నెగ్గండి!

## గొప్ప బహుమతి:

**"ఇండియన్ పనోరమా". 2 పెద్దలకి మరియు 2 పిల్లలకి అన్ని ఖర్చులు చెల్లించే ఆటవిడుపు లేక దానితో సమానమైన రొక్కం రూ. 25,000**

### ...0 రెండవ ...హుమతులు

(...భాషలోను 10)
...ఏ యస్‌యల్‌ఆర్ సైకిల్ లేక ...యంటి క్వార్ట్జ్ వాచ్ లేక దానితో ...నమైన రొక్కం రూ 600

### 300 మూడవ బహుమతులు

(ప్రతి భాషలోను 25)
క్రూయిజర్ పెన్ సెట్ లేక ఎవరెడి కమాండర్ టార్చ్ లేక కామిలిన్ పెయింటింగ్ సెట్

### 1200 కన్సొలేషన్ బహుమతులు

(ప్రతి భాషలోను 100)
చందమామకి ఒక సంవత్సరం ఉచిత చందా

### 1200 'స్పాట్' బహుమతులు

(ప్రతి భాషలోనూ 100)
ప్రతిభాషలోనూ వచ్చిన మొదటి 100 కరెక్ట్ ఎంట్రీలకి అద్భుతమైన కానుక

### ... నెగ్గాలి:

..., చందమామ మీకోసం వినోదంతో పాల్గొని సులభంగా ...ఈ పోటీ నిర్వహిస్తోంది. ఈ క్రింద చూపించిన పాత్రలన్నీ ...తీయ పురాణాలలోని ప్రసిద్ధి చెందిన పాత్రలే. ఇప్పుడు ...త్రలకు సరియైన పేర్లను జతపర్చాలి. అంతే. ఆ తర్వాత ...కు చందమామ అంటే ఇష్టం. ఎందుకంటే..." అనే వాక్యం ...చేయండి, మీ ఎంట్రీని పోటీ కూపన్‌తో (ఏప్రిల్, మే 1983 ...మామ సంచికలలోమాత్రమే లభిస్తుంది) మాకు పోస్ట్‌చేయండి. ...దుకోండి, ప్రవేశరుసుంలేదు! ఒకరు ఎన్ని ఎంట్రీలయినా ...వచ్చు! కాని ప్రతి ఎంట్రీతోనూ ఒక పోటీ కూపన్

### పోటీ నియమాలు & నిబంధనలు

1. అధికార ప్రవేశపత్రం మీద పూర్తిచేసిన ఎంట్రీలే అంగీకరించబడతాయి. 2. మీరు కోరుకున్నన్ని ఎంట్రీలు పంపవచ్చు. ప్రతి ఎంట్రీకి ఏప్రిల్, మే 1983 చందమామ సంచికలలో లభించే పోటీ కూపన్ చేర్చివుండాలి. 3. ఎంట్రీలు స్పష్టంగా నింపాలి. చందమామ ప్రచురింపబడే ఏ భాషలోనయినా పూర్తిచేయవచ్చు. 4. 31 మే 1983 లోపున ఎంట్రీలు మాకు చేరాలి. 5. ఆలస్యంగా అందిన, పోయిన లేక పాడయిన ఎంట్రీలకు నిర్వాహకుల బాధ్యత లేదు. 6. ఎంట్రీలు మాములు పోస్ట్‌లోనే పంపాలి. 7. చందమామ పబ్లికేషన్స్, హిందుస్థాన్ థామ్సన్ ఆసోసియేట్స్ ఉద్యోగులు మరియు వారి బంధువులు తప్ప భారతీయ పౌరులందరూ ఈ పోటీలో పాల్గొనవచ్చును. 8. సర్వస్వతంత్రంగా వ్యవహరించే న్యాయనిర్ణేతల బృందం ఎంట్రీలని పరిశీలిస్తుంది. వారిదే అంతిమ నిర్ణయం. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలకి ...

1

## ప్రవేశ పత్రం

ఉదాహరణలో చూపించిన విధంగా ఈ పేర్లని

కింది బొమ్మలతో జతపరచండి :

1. అర్జునుడు 2. నారదుడు 3. విశ్వామిత్రుడు 4. హనుమంతుడు
5. రావణుడు 6. వసిష్ఠుడు

నాకు చందమామ అంటే ఇష్టం......

(10 మాటలలో)

పేరు ______ వయసు ______

చిరునామా ______

పోస్ట్ చేయవలసిన చిరునామా: కాంటెస్ట్ కో-ఆర్డినేటర్
చందమామ పబ్లికేషన్స్
మద్రాసు 600 026

# మన సంస్కృతిని తెలుసుకోండి పోటీ కూపన్

ప్రతి ఎంట్రీకి ఈ కూపన్ జతచేయాలి

**త్వరపడండి ఎంట్రీలు చేరడానికి ఆఖరిరోజు 31మే, 1983.**

HTM-CMP-1149



# చందమామ

ఏప్రిల్ 1983



ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు






విడి ప్రతి: 2-00
సంవత్సర చందా: 24-00

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

## పాఠకులకు విజ్ఞప్తి

'చందమామ' పత్రికా నిర్వహణలో—ముఖ్యంగా ప్రచురణకు సంబంధించిన అన్ని వస్తువుల ధరలూ కొంత కాలంగా విపరీతంగా పెరిగిపోతున్నాయి. అయినా, పత్రిక ధర పెంచడం ద్వారా, ఆ భారాన్ని పాఠకులపై మోపకుండా వుండేందుకు, సాధ్యమైనంతవరకూ ఆగాము. కాని, పరిస్థితిని అలా కొనసాగించడం సాధ్యం కానందువల్ల, యీ సంచిక నుంచి ధరను రెండు రూపాయిలు చేయడం తప్పనిసరి అయింది. పాఠకులూ, ఏజంట్లూ సహృదయంతో పరిస్థితిని అర్థం చేసుకుని, ఎప్పటిలాగే మాతో సహకరించగలరని ఆశిస్తున్నాము.

సంపుటి 72 ఏప్రిల్ '83 సంచిక 4
విడి ప్రతి : 2-00 :: సంవత్సర చందా : 24-00






పుష్పకనగరంలో శమంతకు డనే దొంగ వుండేవాడు. వాడు రాత్రిళ్ళు దొంగతనాలు చేస్తూ, పగలు మర్యాదస్థుడిలా జీవిస్తూండే వాడు. వాడు ధనవంతుడేకాక, నిజంగా మర్యాదస్థుడే అనుకుని, ఒక ధనికుడు వాడికి తన కూతురు చంపావతినిచ్చి పెళ్ళి చేశాడు.

చంపావతి గుణవతి, శీలవతి, నీతిగా బతకాలనే ఆశయం కలది. తన భర్త దొంగ అని తెలియడానికి ఆమెకు ఎంతో కాలం పట్టలేదు. అప్పుడామెకు కలిగిన బాధ అంతా యింతా కాదు. భర్తను మంచి దారిలో పెట్టాలని ఆమె ఎంతగానో ప్రయత్నించింది. కాని, శమంతకుడికి భార్య మాటలు చెవికెక్కలేదు.

కొన్నాళ్ళకు చంపావతికి కొడుకు పుట్టాడు. వాడికి సుమనుడు అని పేరు పెట్టాడు శమంతకుడు. తండ్రికి వలెనే సుమనుడు కూడా దొంగ అవుతాడేమో అని చంపావతికి భయం పట్టుకున్నది. ఆమె బాగా ఆలోచించి కొడుక్కు అయిదో సంవత్సరం రాగానే చదువు సంధ్యల కని తన తల్లిదండ్రుల ఇంటికి పంపి వేసింది. పద్దెనిమిదేళ్ళు వచ్చే వరకూ, సుమనుడు తాతగారింటనే పెరిగాడు.

దొంగతనంలో కొడుకును తనంతటి వాణ్ణి చేయాలని శమంతకుడు ఉబలాట పడుతున్నాడు. కొడుకు పద్దెనిమిదేళ్ళ వాడయాడని తెలియగానే, అతడు వెళ్ళి వాణ్ణి తన ఇంటికి తీసుకువచ్చేశాడు.

చంపావతికి దిగులు పట్టుకున్నది. ఆమె ఒకనాడు రహస్యంగా సుమనుడికి వాడి తండ్రి ఎలా బతుకుతున్నదీ చెప్పి, "నువ్వు నీతిగా ఏదో వ్యాపారం చేసుకుని బతుకు. అంతేగాని, నీ తండ్రిలా దొంగవు కాకూడదన్నది, నా కోర్కె!" అన్నది.

"వసుంధర"

"అలాగేనమ్మా!" అన్నాడు సుమనుడు సంతోషంగా.

ఇది జరిగిన వారం రోజుల తర్వాత శమంతకుడు, కొడుకుతో, "డబ్బు సంపాదించడానికి ఎన్నో మార్గాలున్నవి. వాటిలో ప్రముఖమైనది దొంగతనం! ఈ రోజు నువ్వు, నాతో వచ్చావంటే, ఈ విద్యలోని సులువులన్నీ నేర్పుతాను," అన్నాడు.

"వద్దునాన్నా! దొంగతనంచేసి పట్టుబడితే, జీవితంలో అంతకంటే అవమానం మరేదీ వుండదు. నేను ఏదైనా వ్యాపారం చేస్తాను," అన్నాడు సుమనుడు.




"మూర్ఖుడా! వ్యాపారంలో తప్పక లాభాలొస్తాయన్న నమ్మకం లేదు; అంతా దైవాధీనం! నా మాట విను. నా విద్య నేర్చుకో," అన్నాడు శమంతకుడు కోపంగా.

"నాన్నా, నేను వ్యాపారం ప్రారంభిస్తాను. అది నా వల్ల కాకపోతే, పోయిందేమీలేదు. అప్పుడే దొంగతనాలు ఆరంభిస్తాను. దొంగతనంలో వేరే మెలుకువలు నేర్చుకోవలసిన అవసరం, నాకు లేదు. అదృశ్యకరణి అనే విద్య అభ్యసించాను. ఆ విద్యవల్ల, నేను తలచుకున్నప్పుడల్లా, మాయం కాగలను. ఆ సమయంలో ఎవరైనా నా చేయి పట్టుకుంటే, వాళ్ళూ అదృశ్యమైపోతారు. ఈ విద్యను నేర్పిన గురువు ముందూ, జన్మనిచ్చిన తల్లిదండ్రులముందూ తప్ప, ఎవరిముందైనా ప్రదర్శించగలను," అన్నాడు సుమనుడు.

శమంతకుడు అనుమానంగా, "ఇలాంటి కబుర్లు నేను నమ్మను," అన్నాడు.

"అయితే, ఈ రాత్రికి మనం ఒక ఇంటికి దొంగతనానికి వెళదాం, కేవలం నా విద్యను ప్రదర్శించడం కోసమే! అక్కడ దొంగతనం చెయ్యడానికి మాత్రం వీల్లేదు. అవసరపడితే తప్ప, నా విద్యను దుర్వినియోగం చెయ్యనని, నా గురువుకు మాట యిచ్చాను," అన్నాడు సుమనుడు. శమంతకుడందుకు అంగీకరించాడు.



ఆ రాత్రి తండ్రీ కొడుకులిద్దరూ నగరం లోకి బయల్దేరారు. ఆ నగరంలో పేరు కెక్కిన వజ్రగుప్తుడనే వ్యాపారి యింటి ముందు ఆగాడు సుమనుడు. తరవాత తండ్రి చేయిపట్టుకుని ఏవో మంత్రాలు జపించి, ''నువ్వింక మాట్లాడకు. మనం ఎవ్వరికీ కనిపించం!'' అన్నాడు.

ఇంటిచుట్టూ పెద్ద ప్రహరీగోడ వున్నది. శమంతకుడు ఆ గోడ దూకాలనుకున్నాడు. సుమనుడు అతణ్ణి వారించి, ''చక్కని రాజమార్గముండగా, మనకీ అడ్డదారు లెందుకు?'' అన్నాడు.

ద్వారం వద్ద కాపలావాడున్నాడు. అయినా, సుమనుడూ, శమంతకుడూ లోపలికి వెళుతూంటే, వాడేమీ పట్టనట్టు పూరుకున్నాడు. ఇద్దరూ కొంతదూరం నడిచి భవనం సింహద్వారం చేరుకున్నారు.

సుమనుడు తెరిచివున్న ద్వారం గుండా లోపలికిపోతూ, తండ్రిని, ''జాగ్రత్త, నా చేయిమాత్రం వదలకు!'' అని చిన్నగా హెచ్చరించాడు.

లోపల ఏదో విందు జరుగుతున్నది, కాని, ఒకరూ ఆ తండ్రీ కొడుకులను గమనించలేదు. సుమనుడు తండ్రిని భవనంలోని అన్ని గదులకూ తీసుకుపోయాడు. ఒక గదిలో నాలుగు పెద్ద పెద్ద పెట్టెలున్నవి. వాటిల్లో రత్నమాణిక్యాలూ, బంగారు నగలూ, బంగారు కాసులూ, చీని చీనాంబరాలూ వున్నవి. అవి చూసి, శమంతకుడి కళ్ళు చెదిరిపోయాయి. సుమనుడు వారించకుండా వున్నట్టయితే, అతడు అక్కణ్ణించి ఏదోకొంత అపహరించుకుపోయేవాడే.

తండ్రి కొడుకులిద్దరూ తిరిగి ఇల్లు చేరాక, ''నీ విద్య ముందు నాకు తెలిసిన దంతా దిగదుడుపు. ఈ విద్య నాకు నేర్పవా?'' అన్నాడు శమంతకుడు.

''దానికేం, తప్పక నేర్పుతాను,'' అన్నాడు సుమనుడు.

తరవాత అతడు తండ్రికి అదృశ్యకరణి పూజావిధానం ఎంతకఠినమైనదో చెప్పాడు.

ఆ విద్య నేర్వకోరినవాళ్ళు ప్రతిరోజూ పురాణపఠనం చెయ్యాలి, నీతి గ్రంథాలు చదవాలి, గంటసేపు దైవపూజ చేయాలి. ఇవన్నీ యథావిధిగా చేశాక, రాత్రి పడుకో బోయేముందు అదృశ్యకరణీ మంత్రాన్ని వందసార్లు జపించాలి. ఇలా పది సంవత్స రాలు చేస్తే, ఆ విద్య శమంతకుడి వశ మవుతుంది.

శమంతకుడు అదృశ్యకరణి విద్య నేర్చుకునేందుకు పట్టుదలగా పూజావిధి ఆరంభించాడు. అప్పుడు సుమనుడు, తల్లితో, "అమ్మా పదిసంవత్సరాలవరకూ నాన్న దొంగతనాల జోలికి వెళ్ళడు. ఈ కాలంలో నీతిగ్రంథాలూ, పురాణాలూ చదువుతూ దైవపూజ చేయడం వలన, ఆయనలో దొంగతనం చేయడం తప్పు, పాపం అన్న భావం కలిగే అవకాశం వున్నది. ఇంక నేను వ్యాపారం ప్రారం భించడానికి ఏ అడ్డంకీ లేదు," అన్నాడు.

"ఇదంతా ఎలా సాధించావురా?" అన్నది చంపావతి ఆశ్చర్యంగా.

"తాతగారింట వుండి చదువుకునే ప్పుడు, నాకు వజ్రగుప్తుడి కుమార్తెతో పరిచయం అయింది. ఆమెకు నేనంటే ఎంతో యిష్టం. ఆమె సాయంతో ఈ నాటక మాడగలిగాను" అంటూ గత రాత్రి తాను చేసినదంతా సుమనుడు తల్లికి చెప్పాడు.

"అంటే, నీ తండ్రి దొంగఅని వాళ్ళం దరికీ తెలిసిపోయిందా?" అన్నది చంపావతి నొచ్చుకుంటూ.

"లేదమ్మా! నాన్న ఆరోగ్యం బాగా లేదనీ, అయినా సంపాయించేందుకు శ్రమ పడుతున్నాడనీ వాళ్లకు చెప్పాను. ఆయన్ని కాస్త విశ్రాంతి తీసుకునేలా చేయా లంటే, యీ అదృశ్యకరణీ నాటకం ఆడా లన్నాను. అంతే!" అన్నాడు సుమనుడు.

శమంతకుడు అదృశ్యకరణీ విద్యకై పూజావిధిలో వుండగానే, సుమనుడు వజ్రగుప్తుడి కుమార్తెను పెళ్ళి చేసు కున్నాడు. తరవాత వ్యాపారంలోని మెల కువలన్నీ మామ దగ్గిర నేర్చుకుని, ఆ నగ రంలోని గొప్పవాళ్ళలో ఒకడయ్యాడు.



# దూడకోసం

సోమరిగా తిరిగే ఎల్లప్ప అనేవాడు ఒక కొబ్బరితోట పక్కగా పోతూ, చెట్ల మీది కాయల్ని చూసి, దొంగిలించేందుకు చెట్టు ఎక్కసాగాడు.

అది చూసిన కాపలావాడు అక్కడికి పరుగున వస్తూ, "ఎవడ్రావాడు, చెట్టెక్కుతున్నది?" అంటూ కేకపెట్టాడు.

ఎల్లప్ప భయపడకుండా, "చెట్టెక్కడం అయిపోయింది, దిగొస్తున్నాను. ఆవు దూడ మాత్రం కనిపించలేదు!" అన్నాడు.

"చెట్టు మీద ఆవుదూడేమిటి? నీ కేమన్నా మతిపోయిందా!" అన్నాడు కాపలావాడు.

"నీ మాటలు వింటూంటే, నువ్వు మా యజమానికన్న తెలివైనవాడివిలా వున్నావు! ఆయన కనబడకుండా పోయిన ఆవుదూడ కోసం చెట్లూ, పుట్టలూ, మెట్టలూ — అన్నీ వెదక మన్నాడు. ఆయన నా మాట నమ్మడు. నువ్వు కాస్త మా యజమాని దగ్గిర కొచ్చి, నేను దూడ కోసం చెట్లన్నీ గాలించినట్టు సాక్ష్యం చెబుతావా? నీ రుణం ఏదోవిధంగా తీర్చుకుంటాను," అన్నాడు ఎల్లప్ప.

ఆ జవాబుతో వీడేదో పరమ అమాయకుడనుకున్న కాపలావాడు, ఎల్లప్పను తన గుడిసెకు తీసుకుపోయి, యింత అన్నం పెట్టి పంపేశాడు.

— రవివరపు రామదాసు






## 18

[వాగులో వున్న ఒక మిట్టమీద కనబడిన సముద్రకేతుడి దొంగలను, వజ్రముష్టి హత మార్చాడు. తరవాత ఉప్పుటేరులో ఒక చిన్న ద్వీపం మీద వున్న సముద్రకేతుడి స్థావరాన్ని శివదత్తుడూ, మందరదేవుడూ చేరారు. అక్కడ సముద్రకేతుడు బంధించి వుంచిన చాలా మందిని విడిపించి, అందరూ సముద్రకేతుడి మీద యుద్ధానికి తలబడ్డారు. తరవాత—]

వజ్రముష్టికీ, సముద్రకేతుడికీ భీకరమైన పోరు ప్రారంభమైంది. రెండు నిమిషాల్లో, వజ్రముష్టి కత్తిదెబ్బకు సముద్రకేతుడి కత్తి తునాతునియలైపోయింది. వజ్రముష్టి తన చేత గల కత్తిని దూరంగా విసిరి వేస్తూ, ''ముష్టాముష్టిగా పోరాడి నిన్ను హతమార్చాలనే నా కోరిక!" అంటూ సముద్రకేతుణ్ణి నడుము పట్టుకుని, చాప చుట్టలా భూమి మీదికి విసిరాడు.

ఆ దెబ్బకు దిమ్మెరపోయి సముద్ర కేతుడు ''అబ్బా'' అంటూ లేచేంతలో వజ్రముష్టి బలమైన చేతులు అతడి కంఠాన్ని వడిసి పట్టుకున్నై. ''పాపాత్ముడా, నీ పాపాలకు యిదే ప్రాయశ్చిత్తం!'' అంటూ వజ్రముష్టి అతడి కంఠాన్ని నులిమి, ఛీత్కరిస్తూ లేచి కాళ్ళతో అతణ్ణి బలంగా తన్నాడు. సముద్రకేతుడిలో చలనం లేదు.




ఆ పిశాచిని హతమార్చగల వ్యక్తి మాలో వున్నాడు," అంటూ వజ్రముష్టిని వారికి చూపించాడు.

ఇంతలో దేవమాయి, స్వయంప్రభతో అక్కడికి వచ్చింది. ఆమె సురక్షితంగా వుండటం అందరికీ చాలా సంతోషం కలిగించింది.

తరవాత హరిశిఖుడి భటులు శివదత్తుడి కోరికపై అతణ్ణి మకరమండలానికి తీసుకుపోయారు. హరిశిఖుడు వారికి గొప్పగా స్వాగతం యిచ్చి, "మీరు నా భటులతో చెప్పినట్టు మకరదేవతను చంపేవాడు మీలో వున్నాడా?" అని అడిగాడు.

కొద్దిసేపట్లో సముద్రకేతుడి అనుచరుల్లో చావగా మిగిలినవాళ్ళు బంధించబడ్డారు. అంతవరకూ యీ పోరాటాన్ని ఎలా ఆపాలో తెలియక, వింతగా చూస్తున్న హరిశిఖుడి భటులు వెంటనే ముంధుకు వచ్చి, "ఇదంతా ఏమిటి? ఎవరు మీరు?" అంటూ శివదత్తుణ్ణి కోపంగా ప్రశ్నించారు.

శివదత్తుడు జరిగినదంతా చెప్పి, "అయ్యా, మేము మీ మకరమండల రాజైన హరిశిఖుడికి మిత్రులుగా వుండదలిచాం. మీరు ఒక మొసలిని దేవతగా పూజించి, రోజూ మనుష్యబలులు యిచ్చే సాంప్రదాయాన్ని గురించి విన్నాం.

దానికి వజ్రముష్టి ముందుకు వచ్చి, "మహారాజా! నేను చిన్నప్పటినుంచీ మా శమనద్వీపంలో మొసళ్ళను వేటాడటం నేర్చినవాణ్ణి! మీరు దయవుంచి ఆ మొసలి ఉన్న స్థావరం నాకు చూపితే, దాన్ని కనుమూసేంతలో తుదముట్టించగలను!" అన్నాడు వినయంగా.

వజ్రముష్టి మాటలకు హరిశిఖుడు నవ్వి, "ఆ మొసలిని మూర్ఖులైన చాలా మంది దేవతగా పూజిస్తున్నారు. కాని అదంటే అందరికీ భయమే! నీవంటి మరుగుజ్జు మానవుడు దానిని హతమార్చగలడని ఒక నమ్మకం కూడా ఉంది. మీ యజమాని అంగీకరిస్తే, నీ శక్తి

సామర్థ్యాలు చూడాలని నాకు కుతూహ లంగా ఉంది!'' అన్నాడు.

శివదత్తుడు అంగీకార సూచనగా తల వూపాడు. తరవాత హరిశిఖుడితో విన యంగా, ''మహారాజా! ఈ మొసలి కలి గించే ఆపదలనుంచి మీ ప్రజలను మేము రక్షిస్తాం. దీనికి ప్రతిగా మీనుంచి మేము కొంత సహాయం కోరవచ్చునా?'' అన్నాడు.

హరిశిఖుడు నవ్వి, ''సహాయమా? అది ఎలాంటిదైనా చేయగలను. మకర దేవతగా పిలవబడే, ఈ మకర పిశాచికి నా ప్రజల మూఢవిశ్వాసంవల్ల నేనెంతో ధనం ఖర్చు పెట్టి మనుష్యులను దానికి ఆహారంగా సమర్పించేందుకు కొంటు న్నాను,'' అన్నాడు.

అప్పుడు శివదత్తుడు, హరిశిఖుడికి, కుండలినీ, మరాళద్వీపాల వృత్తాంత మంతా చెప్పి, ''మీకు గొప్ప నావికా దళం, పెద్ద సేన ఉన్నదని విన్నాను. మా దేశాలను క్రూరుల పరిపాలన నుంచి విముక్తి చేసేందుకు మీరు సహాయ పడాలి!'' అని అడిగాడు. హరిశిఖుడు అంగీకరించాడు.

ఆ రాత్రి శివదత్తుడికీ, అతడి అను చరులకూ, హరిశిఖుడు గొప్ప విందు చేశాడు. మకర మండలంలోని అన్ని ప్రాంతాలకూ వార్తాహరులు పంపబడ్డారు.




ఎంతోకాలం నుంచి ఎదురు చూస్తున్న మరుగుజ్జు వచ్చాడనీ అతడు మూఢులచే మకరదేవతగా పిలవబడే పిశాచిని, చంప గలడనీ వాళ్ళు చాటింపు వేశారు.

మరునాడు మిట్టమధ్యాహ్నం వేళ మకరమండల వాసులందరూ, మొసలి నివసించే ప్రాంతానికి వచ్చారు. అక్కడ ఉన్న ఒక కొండశిఖరం నుంచి చూస్తే, కింద పారుతున్న ఒక నది కనబడుతుంది. ఆ నది అంచున ఒక గుహ ఆ మొసలికి నివాసస్థానం.

వజ్రముష్టి అడుగు పొడవు గల రెండు కత్తులను, పిడుల దగ్గర బలమైన తాడుతో బిగించి, దానిని గుప్పెటతో పట్టు

కుని అందరూ చూస్తూండగా శిఖరం మీది నుంచి నదిలోకి దూకాడు. తరవాత నది అవతలి ఒడ్డు చేరి, మొసలి నివసించే గుహ దగ్గిరకు వెళ్ళాడు.

వజ్రముష్టి గుహను సమీపించేంతలో, లోపలి నుంచి నిప్పులు చెరిగే కళ్ళతో పర్వతంలా ఉన్న మొసలి బయటికి వచ్చి నోరు తెరుచుకుని అతడి మీదికి దూకింది. వజ్రముష్టి ఉన్నచోటు నుంచి వెనుకడుగు వేయకుండా తన చేత గల కత్తులను దాని నోటిలోకి పోనిచ్చాడు. రెండువైపులాగల వాడి కత్తులు మొసలి రెండు దవడలలో బలంగా గుచ్చుకు పోయినై. అది బాధతో అటూ ఇటూ కొట్టుకుని నదిలోకి దూకింది.

వజ్రముష్టి అదే అదనుగా భావించి తన దగ్గిర ఉన్న పెద్ద కత్తిని ఒరలో నుంచి దూసి, మొసలితోపాటు నదిలో దూకాడు. ఒకటి రెండు గంటలసేపు నీటిలో వజ్రముష్టికీ, మొసలికీ ఘోర మైన పోరు జరిగింది. వజ్రముష్టి దాని తోక దెబ్బల నుంచి తప్పుకుంటూ, క్రమంగా దాని శరీరాన్ని కత్తితో బాగా గాయపరిచి, చివరకు కొన ఊపిరితో ఉన్న మొసలిని ఒడ్డుకు లాగాడు.

కొండ శిఖరంనుంచి ఈ భయంకర పోరాటాన్ని చూస్తున్న ప్రజలూ, హరి




శిఖుడూ మొసలి మరణం చూసి జయ జయ ధ్వానాలు చేశారు. ఆ తరవాత వారం రోజులపాటు మకరమండలంలో ఆనందోత్సవాలు జరిగినై.

హరిశిఖుడు తను చేసిన వాగ్దానం ప్రకారం, శివదత్తుడికి గొప్ప నావికా బలాన్నీ, ఇరవైవేల మంది సైనికులనూ ఒప్పచెప్పాడు. ఒక శుభముహూర్తాన శివదత్తుడూ, మందరదేవుడూ తిరిగి మరాళ, కుండలినీ ద్వీపాలను నరవాహనుడి నుంచి జయించేందుకు బయలుదేరారు. వారి వెంట దేవమాయి, స్వయంప్రభ కూడా ఉన్నారు. స్వయంప్రభ శమనద్వీప రాజకుమార్తె అన్న



సంగతి అప్పుడు దేవమాయి శివదత్తుడికి తెలియబరిచింది.

శివదత్తుడు శమనద్వీపానికి రాయబారులను పంపాడు. స్వయంప్రభా, మందరదేవుల వివాహం ఆ మూడు రాజ్యాలకూ మేలు చేయగలదని అతడి నమ్మకం.

తన కుమార్తె క్షేమంగా వున్నదనీ, ఆమెను మరాళద్వీప రాజైన మందరదేవుడు వివాహమాడగోరుతున్నాడనీ తెలిసినప్పుడు శమనద్వీప రాజైన శమనుడు ఎంతగానో సంతోషించాడు. అతడు కూడా కొంత నావికాబలంతో, సైనికబలంతో కాబోయే అల్లుడికి సహాయపడేందుకు బయలుదేరాడు.

వేగులవల్ల తన మీదకు రానున్న యీ దాడిని గురించి విన్న నరవాహనుడు, భయంతో వణికిపోయాడు. మరాళ, కుండలినీ ద్వీపాలు రెంటినీ రక్షించుకోవటం తలకు మించిన కార్యమని అతడికి తోచింది. అతడు గుట్టుచప్పుడు కాకుండా, మరాళద్వీపాన్ని వదిలి, ఉన్న బలాన్నంతా కుండలినీ ద్వీపంలో కేంద్రీకరించాడు.

ఏ ప్రతిఘటనా లేకుండా శివదత్తుడూ, మందరదేవుడూ, ముందుగా మరాళ ద్వీపాన్ని ఆక్రమించుకున్నారు. మరునాడు కుండలినీ ద్వీపంలో దిగారు. తీరంలో ఎక్కడా నరవాహనుడి సైనికుడే లేడు.

శివదత్తుడికి యిది చాలా ఆశ్చర్యం కలిగించింది. అతడు లోపలి ప్రాంతాలకు వేగులను పంపాడు. వారు వెళ్లిన కొద్ది సేపటికే తిరిగివచ్చి, "అయ్యా, మనం దాడి వస్తున్నామని తెలిసి లోగడ నరవాహనుడి చేత చిత్రహింసలకు గురి అయిన కోయలు, ఒక్కుమ్మడిగా తిరుగుబాటు చేశారు. వాళ్ల మూకలు, యిప్పుడు కుండలినీ నగరాన్ని ముట్టడిస్తున్నట్టు తెలిసింది!" అని చెప్పారు.

ఈ వార్త మందరదేవుణ్ణి చాలా నిరుత్సాహపరిచింది. "ఏ నాటికైనా, నా

స్వహస్తాలతో ఆ క్రూర నరవాహనుణ్ణి చంపి తీరుతానని ప్రతిజ్ఞ చేశాను. ఇప్పుడు ఆ ప్రతిజ్ఞ వమ్మయేలా వుంది!'' అన్నాడు మందరదేవుడు.

తరవాత శివదత్తుడు, ఓ యాభై మంది అశ్వసైనికులను యిచ్చి, వజ్రముష్టిని ముందు పంపాడు. ఒకవేళ నరవాహనుడు యింకా బ్రతికి వుంటే, అతణ్ణి చంపవద్దని కోయలకు ఆజ్ఞాపించవలసిందిగా, అతడు హెచ్చరించబడ్డాడు.



వజ్రముష్టి అశ్వికులతో కుండలినీ నగరం చేరేసరికి, మిడతల దండులా కోయలు నగరం మీద పడ్డారు. వాళ్ళ కత్తులకూ, బాణాలకూ నరవాహన సైనికులు వందల వేల సంఖ్యలో దుర్మరణం పాలయారు. వజ్రముష్టి, శివదత్తుడి నుంచి తను తెచ్చిన వర్తమానం కోయ నాయకులకు తెలియబరుస్తూ, కోటను సమీపించేంతలో, ఒక బురుజు మీద కాళ్ళూ, చేతులూ బంధింపబడిన నరవాహనుడు కోయభటుల మధ్య కనిపించాడు

వజ్రముష్టి, ''అతణ్ణి చంపకండి, చంపకండి!'' అని గట్టిగా అరుస్తూ, గుర్రాన్ని బురుజు కేసి పరిగెత్తించేంతలో, క్రూర నరవాహనుడు బురుజు మీది నుంచి కింద వున్న అగడ్తలోకి తోయబడ్డాడు. అదే సమయంలో ఆ ప్రాంతాల గుమిగూడిన కోయలు మహదానందంతో హర్షధ్వానాలు చేశారు. వజ్రముష్టి అగడ్తను సమీపించేసరికి నరవాహనుడు మరణించాడు.

రెండు మూడు గంటల తరవాత శివదత్తుడూ, మందరదేవుడూ, శమనుడూ, అక్కడికి వచ్చారు. వారికి కోయ నాయకులు ఘనమైన స్వాగతం యిచ్చారు. అప్పటికప్పుడే మందరదేవుడు మరాళ ద్వీపంతోపాటు కుండలినీ ద్వీపానిక్కూడా రాజుగా ప్రకటింపబడ్డాడు. కోయలందరికీ లోగడ నరవాహనుడు ఆక్రమించుకున్న భూములు తిరిగి ఇచ్చివేయబడినై.

వారం రోజుల తరవాత అతివైభవంగా మందరదేవుడికీ, స్వయంప్రభకూ వివాహం జరిగింది. శివదత్తుడు, హరి శిఖుడు పంపిన సైనికులందరికీ గొప్ప గొప్ప బహుమానా లిచ్చి, తిరిగి వారిని, వారి మకరమండలానికి పంపివేశాడు.

తరవాత ఒకరోజున శివదత్తుడి కోరికపై మందరదేవుడు నిండు సభ ఏర్పాటు చేశాడు. దానికి మరాళ, కుండలినీ ద్వీపాల్లోని పెద్దలంతా విచ్చేశారు. శివదత్తుడు తను సన్యసించి, అడవులకు వెళ్ళు తున్నట్టూ, శేషజీవితాన్ని దైవధ్యానంలో గడపదలిచినట్టూ ప్రకటించాడు.

ఇది మందరదేవుడితోపాటు, సభికు లందర్నీ కలవరపరిచింది. వాళ్లందరూ శివదత్తుణ్ణి మంత్రిగా గాని లేక రాజ గురువుగా గాని ఉండి, రాజ్యపాలన సక్రమంగా నడిచేట్టు చూడవలసిందిగా కోరారు. శివదత్తుడు అంగీకరించలేదు. అతడు సభికులనూ, మందరదేవుణ్ణీ ఉద్దేశించి ఇలా చెప్పాడు:

''పాలకులూ, పాలితులూ ఎలాంటి ధర్మాలను పాటించితే, దేశానికి క్షేమమో యీ సరికి కుండలినీ, మరాళద్వీప వాసు లందరికీ తె[illegible]నని నేను భావిస్తున్నాను. చిత్రసేన, సమరసేనుల పరిపాలనలతో బాటు, క్రూర నరవాహనుడి పరిపాలనను కూడా అందరూ చవిచూశారు. కనుక ఎలాంటిది ధర్మపాలనో, ఎలాంటిది కాదో ప్రజలందరికీ తెలిసి వుంటుంది. దానికి అనుగుణంగా వారు ప్రవర్తించగలరని నేను నమ్ముతున్నాను!''

శివదత్తుడి మాటలకు సభికులంతా హర్షధ్వానాలు చేశారు. హర్షధ్వానాల మధ్య శివదత్తుడు అందరికీ నమస్కరించి, సభ నుంచి బయలుదేరాడు. రాజూ, ప్రజలూ అతణ్ణి అనుసరించి పట్టణానికి నాలుగైదు క్రోసుల దూరంలో వున్న అరణ్యం వరకూ సాగనంపారు. శివదత్తుడు అక్కడ అందరికీ మరోమారు నమస్కరించి, అరణ్యంలోకి వెళ్ళిపోయాడు. —(అయిపోయింది)





# పేద సైనికుడు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి, భుజాన వేసుకుని ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఇంత అర్ధరాత్రివేళ, ఎంతో ఓర్పుతో నువ్విన్ని శ్రమలకు లోను కావడానికి కారణం ఏమై వుంటుందో తెలియడం లేదు. కీర్తి కోసమో, ధనం కోసమో లేక అనాలోచితంగా ఎవరికో యిచ్చిన వాగ్దానాన్ని నిలబెట్టుకోవడానికో అయితే మాత్రం, కట్టకడపటికి తప్పక విచారిస్తావు. ఏదీ శాశ్వతంకాని యీ లోకంలో, మనిషి దేని పట్లా దురాశకు లోనుకారాదు. ఇందుకు నిదర్శనంగా నీకు, విభిన్న వృత్తులూ, మనస్తత్వాలూ గల ముగ్గురు వ్యక్తుల కథ చెబుతాను. శ్రమ తెలియకుండా విను," అంటూ యిలా చెప్పసాగాడు:

## బేతాళ కథలు




ఒకానొక అరణ్య ప్రాంతంలోని కుగ్రామంలో ఒక పేదవాడు నివసిస్తూండేవాడు. అతడికి భా ్య, పెళ్లీడుకు వచ్చిన ముగ్గురు కుమార్తెలూ వున్నారు. కుమార్తెల పెళ్ళిళ్ళు చేయాలంటే డబ్బు కావాలి. అది లభించే మార్గం తెలియక పేదవాడు సదా విచారిస్తూండేవాడు.

ఒకనాడు అతడి భార్య, "ఇలా విచారిస్తూ కూర్చుంటే, మనం మరింత చిక్కులపాలవుతాం. నువ్వు రాజుగారి సైన్యంలో పనిచేస్తూ, యుద్ధంలో గాయపడినందువలన గదా, ఉద్యోగం మానుకోవలసివచ్చింది. నువ్వు, రాజుగారి దగ్గిరకు పోయి, సంగతి చెప్పి, సహాయం కోరితే, ఆయన తప్పక అంతో, యింతో డబ్బు యిస్తాడు," అన్నది.

పేద సైనికుడికి భార్య సలహా నచ్చింది. రాజు చాలా ధర్మబుద్ధి కలవాడని అతడెరుగు. అతడు వెంటనే అరణ్యానికి ఆవలనున్న రాజధాని ప్రతిష్ఠానపురానికి బయలుదేరాడు.

ఒకప్పుడు రాజుకు సేవ చేసిన సైనికుడు కావడంతో, అతడికి రాజుగారి దర్శనం తేలికగానే లభించింది. పేద సైనికుడు, రాజుకు తాను వచ్చిన పని చెప్పి, కొంత ధనసహాయం చేయమని కోరాడు.

రాజు ఎంతో సానుభూతి కనబరుస్తూ, "మామూలు పరిస్థితుల్లో అయితే, నీకు తప్పక సహాయం చేసి వుండేవాణ్ణి. కాని, ఆ మధ్య వచ్చిన వరదల కారణంగా, మన రాజ్యంలోని ఉత్తర ప్రాంతాన యాభై గ్రామాలు బాగా దెబ్బ తిన్నవి. ఆ గ్రామ ప్రజలకు కొత్త నివాసస్థానాలు ఏర్పాటు చేసేవరకూ, ఎవరికీ ఎలాంటి ధనసహాయం చేయవద్దని, నిన్ననే కోశాధికారికి తెలియబరిచాను. అసలు సంగతేమంటే, ప్రస్తుతం కోశాగారంలో నష్టపోయిన ఆ గ్రామాల ప్రజలను ఆదుకునేందుకు సరిపడా ధనం లేదు," అన్నాడు.

"క్షమించండి, మహారాజా! పరిస్థితి యింత క్లిష్టంగా వున్నదని నాకు తెలియదు. సెలవు." అని పేదసైనికుడు అక్కడినుంచి బయలుదేరాడు.



అతడు తన గ్రామానికి ప్రయాణమై, చీకటిపడేవేళ అరణ్యంలో దారితప్పాడు. దానికితోడు ఉరుములూ, మెరుపులతో వాన ప్రారంభమయింది. పేదసైనికుడు, యీ రాత్రికి ఎక్కడ తలదాచుకోవడమా అని దిక్కులు చూసేంతలో, ఒక చిన్న కొండనానుకుని శిథిలమైన ఇల్లొకటి కనిపించింది.

అతడు ఆ ఇంటిలోకి ప్రవేశించేంతలో ఒక నక్కా, అడవిపిల్లీ బయిటికి పారిపోయినై. కొన్ని గబ్బిలాలు కీచుమంటూ అతడి తలమీదుగా ఎగిరినై. శిథిలమైపోయిన ఒక గోడవైపు నుంచి పాము బుస కొట్టిన శబ్దం వినిపించింది.

ఇప్పుడేమి చేయడమా అని సైనికుడు ఆలోచించేంతలో ఉరుముతోపాటు కళ్ళు జిగేలుమనిపించే మెరుపు మెరిసింది. ఆ కాంతిలో తనకేసి వస్తున్న పిశాచాన్నొకదాన్ని అతడు చూశాడు. వెంటనే సైనికుడు అక్కడినుంచి పారిపోయేందుకు వెనుదిరిగాడు. కాని, పిశాచం అతడికంటే ముందే ద్వారం దగ్గిరకు పోయి నిలబడింది. ఇక తనకు చావు తప్పదనుకున్న సైనికుడు గుండె దిటవు చేసుకుని మొండి ధైర్యంతో పిశాచం కేసి చూస్తూ నిలబడ్డాడు.

"భయపడకు! నేను పిశాచాన్నయినా, నీకు మాత్రం ఏమీ హాని కలిగించను," అన్నది పిశాచం.

ఆ మాటలతో ధైర్యం తెచ్చుకున్న సైనికుడు, "అలాగా! నేనూ, నీకెలాంటి హానీ చేయబోవడంలేదు. నా దారిన నన్ను పోనియ్యి," అన్నాడు.

పిశాచం పెద్దగా నవ్వి, "నువ్వు కావాలనుకున్నా, నాకు హాని చెయ్యలేవు! కాని, ప్రయత్నిస్తే, నాకు మేలు చెయ్యగలవు. ఈ క్షణంలో నీకు ఏదైనా మేలు చెయ్యా



బంగారమంతా నీకిస్తాను. అది బహుశా ముప్ఫై లక్షల బంగారు కాసులకు తక్కువుండదు. అందుకు ప్రతిఫలంగా, నువ్వొక సాయం చేయాలి. పవిత్రమైన గయా క్షేత్రంలో, శాస్త్రోక్తంగా నా అంత్యక్రియలు జరిపి రావాలి,'' అన్నది పిశాచం.

ఈ వింత కోర్కె విని ఆశ్చర్యపోతున్న పేద సైనికుడితో పిశాచం, గుహలోని ధనాన్ని గురించి చెప్పింది:

అప్పటికి రెండు తరాలకు పూర్వం, ఆ ప్రాంతాల మహా క్రూరుడైన బందిపోటు దొంగ ఒకడుండేవాడు. వాడు దొంగతనాల్లో సుశిక్షితులైన కొద్దిమంది అనుచరులతో అరణ్యమార్గాన ప్రయాణించే వర్తకులనే కాక, దూరప్రాంతాల్లో నివసించే గ్రామీణ ధనికుల్నీ, పట్టణాల్లోని సంపన్నుల్నీ దోచుకునేవాడు. అలా దోచిన ధనంలో ప్రతి ఒక్కరికీ సమాన భాగం వుంటుందని చెప్పి, ఆ ధనాన్ని అనుచరుల సాయంతో యిక్కడి గుహలోకి చేరవేశాడు. కాని, ఒకనాడు రాజుగారి సైనికులు అరణ్యంలో ఆ బందిపోట్లను చుట్టుముట్టారు. అప్పుడు జరిగిన పోరులో బందిపోట్ల నాయకుడు తప్ప, మిగతా వాళ్ళందరూ ప్రాణాలు కోల్పోయారు.

బతికి బయటపడ్డ బందిపోట్ల నాయకుడు ఆ రోజు నుంచీ గుహలో వున్న

లన్న ఆలోచన వచ్చింది. నీకేమైనా ధనం కావాలా?'' అన్నది.

''ధనమా? కావాలి!'' అన్నాడు పేద సైనికుడు ఆశగా.

''ఎంత?'' అని అడిగింది పిశాచం.

''షుమారు—ముప్ఫై కాసుల బంగారం యిచ్చావంటే, నా కూతుళ్ళ పెళ్ళిళ్ళు చేసేస్తాను,'' అన్నాడు సైనికుడు.

ఆ జవాబు విని పిశాచం నవ్వడం ప్రారంభించింది. సైనికుడు ఆశ్చర్యపోతూ, ''ఎందుకలా నవ్వుతావు?'' అని అడిగాడు.

''నువ్వు పట్టి అమాయకుడిలా వున్నావు. ఈ పక్కనే వున్న గుహలోని

ధనానికి కాపలా కాస్తూ, అక్కడే కాలం గడపసాగాడు. ఆ రహస్యప్రదేశం వదిలి మరెక్కడికైనా వెళితే, రాజుగారి సైనికులు పట్టుకుంటారని వాడి భయం. ఒక రోజున అరణ్యంలో వాణ్ణి పులి చంపింది. ఆనాటి నుంచి వాడు పిశాచి రూపంలో ఆ ధనానికి కాపలా కాస్తూనే వున్నాడు.

కొన్ని సంవత్సరాలు గడిచినై. ఒక నాడు అరణ్యమార్గాన పోతున్న యాత్రికుడొకణ్ణి చూసి, పిశాచం అతడికి సంగతి చెప్పి, తనకీ నికృష్టమైన పిశాచి బతుకు పోయేందుకు గయలో తన అంత్యక్రియలు జరపమన్నది. అందుకు ప్రతిగా గుహలోని ధనం యిస్తానన్నది. యాత్రికుడు ఒప్పుకున్నాడు.

యాత్రికుడు గయ నుంచి తిరిగి వచ్చాక పిశాచం అతడికి గుహలోని ధనం చూపించి, పైశాచిక జీవనం నుంచి విముక్తి చెందింది. ధనవ్యామోహంలో చిక్కిన యాత్రికుడు గుహ దగ్గిరే ఒక ఇల్లు కట్టుకుని, ధనాన్ని కాపలా కాయసాగాడు. కొంతకాలం గడిచిన తరవాత అతడు మరణించి, పిశాచ రూపంలో యింకా దానికి కాపలా కాస్తూనే వున్నాడు. అతడి పిశాచమే యిప్పుడు పేద సైనికుడితో మాట్లాడుతున్నది!

''గయా క్షేత్రంలో ఆ కర్మకాండ అంతా తప్పక చేస్తాను. ఆ ధనం వున్న చోటు చూపించు,'' అన్నాడు సైనికుడు ఉత్సాహంగా.





''ముందు గయకు వెళ్లి, చేయవలసిన పని ముగించుకు రా. తరవాత ఆ గుహ లోని ధనం చూపిస్తాను,'' అన్నది పిశాచం.

పేదసైనికుడు అందుకు సరేనన్నాడు. వానా గాలీ తగ్గగానే పిశాచం అతడికి అరణ్యం నుంచి బయటపడేందుకు సరయిన మార్గం చూపించింది. సైనికుడు గయకు వెళ్ళి, శాస్త్రవిధిగా కర్మ జరిపి, కొద్ది కాలంలోనే అరణ్యానికి తిరిగి వచ్చాడు.

పిశాచి శిథిలగృహం ముందు అతణ్ణి కలుసుకుని, ''నీ కోసమే ఎదురుచూస్తున్నాను; నీ సాయానికి చాలా కృతజ్ఞుణ్ణి. నా వెంట రా, నీకు ధనం వున్న గుహ చూపించి, యీ పిశాచరూపం నుంచి త్వరగా విముక్తి పొందుతాను.'' అన్నది ఉత్సాహంగా.

పేదసైనికుడు పిశాచం వెంట వెళ్లాడు. శిథిలగృహం వెనక ధనం దాచిన గుహ వున్నది. గుహద్వారానికి పెద్దరాయి ఒకటి అడ్డంగా వుండడంతోపాటు, దాని చుట్టూ అడవి మొక్కలూ, తీగలూ అల్లిబిల్లిగా అల్లుకుని వున్నవి.

''ఇదీ ధనం వున్న గుహ! అడ్డుగా వున్న రాయి తొలగించి, ఆ ధనం నీకు చూపుతాను,'' అన్నది పిశాచి.

పేద సైనికుడు ఒక క్షణం ఆలోచించి, పిశాచితో, ''నీకు చాలా కృతజ్ఞుణ్ణి. ఆ రాయి తొలగించనవసరం లేదు!'' అని చెప్పి, అప్పటికప్పుడే బయలుదేరి రాజధాని ప్రతిష్ఠానపురం వెళ్ళాడు.

అతను రాజును కలుసుకుని, ''మహారాజా, వరద బాధితులైన గ్రామీణుల సహాయానికి, మీ కెంత ధనం కావాలి?'' అని అడిగాడు.

ఆ ప్రశ్న విని రాజు చాలా వింత పడ్డాడు. అంతకు కొద్దిరోజుల ముందే పేద సైనికుడు దానం కోసం తన దగ్గిరకు వచ్చిన సంగతి ఆయనకు గుర్తున్నది. అయినా రాజు అతణ్ణి, ''ఇరవై లక్షల

బంగారు కాసులు దొరికే అవకాశ మున్నదా ?'' అని అడిగాడు.

''ఇరవై కాదు, మీరు నా వెంట వస్తే, ముప్పై లక్షల బంగారు కాసులు యివ్వ గలను,'' అన్నాడు పేదసైనికుడు.

రాజుకు కలిగిన ఆశ్చర్యం అంతా యింతా కాదు. ఈ సైనికుడికేమయినా పిచ్చి పట్టిందేమో అన్న అనుమానం కూడా ఆయనకు కలిగింది. కాని, అతడి మాటల్లో ఏదో నిజాయితీ ధ్వనించడంతో రాజు తన మంత్రీ, సేనానాయకుడితో పాటు కొంతమంది అంగరక్షకులతో సైని కుడి వెంట అరణ్యానికి వెళ్ళాడు.



అక్కడ గుహలో వాళ్ళకు నిధి కని పించింది. దాన్ని రాజు నగరానికి పట్టించుకుపోయి, వరద బాధితులకు సహాయం చేసేందుకు ఏర్పాట్లు చెయ్య మని మంత్రితో చెప్పి, పేద సైనికుడితో, ''నీకు ఆ నిధిలో కొంతభాగం యివ్వడం న్యాయం. తీసుకో !'' అన్నాడు.

''వద్దు, మహారాజా ! ఆ ధనాన్నంతా వరదబాధితుల సహాయానికి వినియోగిం చండి. అయినా, మీకిచ్చిన బహుమతిలో నుంచి, తిరిగి కొంత నేనెలా తీసుకో గలను ?'' అన్నాడు పేదసైనికుడు.

''అలా అయితే, నా కోశాగారం నుంచి కొంత ధనం తీసుకో,'' అని రాజు, పేద సైనికుడికి యాభైవేల బంగారు కాసులు యిప్పించడమే కాక, నిండు సభలో అతణ్ణి గొప్పగా మెచ్చుకున్నాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, నాకు చాలా సందేహాలు కలుగుతున్నవి. బందిపోట్ల నాయకుడూ, యాత్రికుడూ బతికినంతకాలం గుహలోని ధనాన్ని దమ్మిడీ ఖర్చు పెట్టకుండా, కుక్కకాపలా కాసి, మరణించిన తరవాత పిశాచాలయి, దానిపట్ల విరక్తి ఎందుకు చెందారు ? పేదసైనికుడు ఆ ధనాన్ని తనదిగా చేసుకోవచ్చు గదా ? ఆ పని చేయక పోగా, దాన్ని చూడడానికే ఎందుకు ఒప్పుకోలేదు? ఈ సందేహానికి సమాధానం

తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "పిసినారి తనం కొద్దీ, అదే పనిగా ధనం కూడబెట్టే వాళ్ళు, ఏదో ఒకనాడు దాన్ని తమకు తోచినవిధంగా అనుభవించగలమనుకుంటారు. కాని, చనిపోయి పిశాచాలయిన తరవాత, ఆ ధనం తమకు ఎందుకూ కొరగాదని గ్రహిస్తారు. ఆ కారణం వల్లనే శాస్త్రోక్తంగా అంత్యక్రియలు జరిపించుకుని పిశాచ జీవితం నుంచి బయట పడేందుకు ఆరాటపడతారు.

ఇకపోతే, పేదసైనికుడు చాలా ఇంగిత జ్ఞానం కలవాడు. గయలో తనకు అంత్యక్రియలు జరగనిదే, ఆ నిధిని చూపించేందుకు పిశాచం నిరాకరించడానికి కారణమేమిటో అతడు పసిగట్టాడు. ఒకసారి ఆ నిధి చూడడం జరిగితే, తనలాగే అతడూ ధనవ్యామోహంలో అక్కడే వుండిపోతాడని పిశాచం అనుమానించింది. హత్యలద్వారా, దారిదోపిడీల ద్వారా అనేకమందిని హింసించి కూడబెట్టిన ధనం శాపగ్రస్తమైనదని పేదసైనికుడు గ్రహించాడు. అందుచేతనే అతడు ముందుగా ఆ నిధిని చూసేందుకు నిరాకరించడం జరిగింది. దాన్ని చూసిన యాత్రికుడు, ధనలోభం కొద్దీ అక్కడి నుంచి వెళ్ళలేక, చచ్చి పిశాచమై, దానికి కాపలా కాస్తున్నాడు. ధనానికి తాను యజమాని కావడానికి బదులు, ధనం తనకు యజమాని అయే దుర్దశ తనకు కలగకూడదని పేదసైనికుడు ముందుగానే జాగ్రత్తపడ్డాడు. ఇక్కట్లలో వున్నవాళ్లకు సాయపడడం ద్వారానే అలాంటి ధనానికి పవిత్రత కలుగుతుంది. అందుకే అతడు దానిలోంచి భాగం తీసుకోవడానికి యిష్టపడక, రాజుకు దాన్ని వరదబాధితులకు సాయం చేసేందుకు ఖర్చు పెట్టవలసిందిగా సలహా యిచ్చాడు," అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)





# బద్ధశత్రువులు

కూనవరంలో మంగయ్య, ఛెంగయ్య అనే యిద్దరు సన్నకారు రైతులుండేవాళ్లు. ఇద్దరి ఇళ్ళకూ మధ్య ఒక చిన్న గోడే అడ్డం. ఇద్దరి పొలాలు కూడా పక్క పక్కనే వుండేవి. ఇద్దరూ పంటలు పండించడంలో మంచి నేర్పుగలవాళ్ళేగాని, ఒకరిని చూసి మరొకరు అసూయపడే వాళ్ళు. ఒకరికి తెలియకుండా మరొకరు, రెండోవాళ్ళకు నష్టం కలిగించడం ఎలాగా అని ఆలోచిస్తూండేవాళ్ళు.

ఒక సంవత్సరం యిద్దరూ తమ చేలో జొన్నవేశారు. ఇద్దరి చేలల్లోనూ జొన్న కంకులు పాలుపోసుకుంటున్న సమయంలో అడవి జంతువులూ, పక్షులూ పంట పాడుచెయ్యకుండా, యిద్దరూ రోజూ పొలం కాపలాకు వెళుతున్నారు.

మంగయ్య చేను చూసిన చెంగయ్య, "వీడి చేలో జొన్న, యీ సంవత్సరం విరగపండేటట్టుంది. కంకికి సోలెడు గింజలు రాలేట్టున్నాయి!" అనుకున్నాడు అసూయగా.

చెంగయ్య చేను చూసిన మంగయ్య కూడా అలాగే అనుకున్నాడు: "ఈ సంవత్సరం వీడి చేలో జొన్న విరగపండేలా వున్నది. ఈ పంటంతా వీడి చేతికి వస్తే, యిక పట్టపగ్గాలుండవు!"

ఒక రోజు చెంగయ్య భార్య అతడితో, "ఆ మంగయ్య పెళ్ళాం మిడిసిపాటు చూశారా! ఈ సంవత్సరం జొన్నపంట మీద వచ్చిన డబ్బుతో, మొగుడు ముత్యాలగొలుసు చేయిస్తానన్నాడట. ఆవిడ మెడలో ముత్యాలగొలుసు వేసుకుని కులుకుతూంటే, నేను బోసిమెడతో ఎలా తిరిగేది?" అన్నది కోపంగా.

చెంగయ్య భార్యను సముదాయిస్తూ, "ఇల్లలకగానే పండగ అవుతుందా ఏమిటి!

గుంటక సాంబిరెడ్డి



వాడి చేలో పంట చేతికొచ్చి అమ్మినప్పుడు గదా, పెళ్ళానికి ముత్యాలహారం చేయించేది ? ఒకవేళ అంతవరకూ వస్తే, నేనూ నీకు పగడాలగొలుసు చేయిస్తాలే," అన్నాడు.

వాళ్ళిద్దరి మధ్యా జరిగిన సంభాషణ గోడ అవతలి నుంచి మంగయ్య భార్య విననేవిన్నది. ఆమె భర్త దగ్గిరకుపోయి, "అ చెంగయ్య, అతడి పెళ్ళాం ఏం మాట్లాడుకుంటున్నారో తెలుసా ? ఈ సంవత్సరం పంట మన చేతికొచ్చినప్పుడు చూద్దాం, అంటున్నాడు చెంగయ్య. తానేమో తన పంటతో పెళ్ళానికి పగడాల గొలుసు చేయిస్తాట్ట !" అన్నది.

వసారాగది గోడకు చేరగిలబడి కూర్చున్న మంగయ్య కోపంగా లేచి పైపంచ దులిపి భుజాన వేసుకుని, "మన పంట చేతికి రాకుండా చేస్తానన్నాడా ! మన పంట ఎట్లా చేతికి రాదో, వాడి పంట ఎలా వస్తుందో, నే చూస్తాలే," అన్నాడు.

అతడు అప్పటికప్పుడే, తూర్పు చెరువు గట్టు నానుకుని వున్న తుమ్మతోపులో గుడిసె కట్టుకుని వుండే మంత్రాల మరిడయ్య దగ్గిరకుపోయాడు. ఈ మరిడయ్య క్షుద్రదేవతోపాసకుడు.

"మరిడయ్యా, నువ్వు నా కొక చిన్న సాయం చేయాలి, రాత్రివేళ నాలుగైదు గంటలపాటు నే నేదైనా జంతువుగా మారేందుకు మంత్రమో, మందో వుంటే యివ్వు," అన్నాడు మంగయ్య.

మరిడయ్య గుడిసె చూరులోంచి మూడు చిన్న పొట్లాలు తీసి మంగయ్యకు చూపుతూ, "నువ్వు ఏ గుర్రంగానో, ఎద్దుగానో మారాలంటే నూరు రూపాయిలివ్వాలి. గాడిదగా మారదలిస్తే మాత్రం యాభై రూపాయలు !" అన్నాడు.

"నా పనికి గాడిద రూపం చాల్లే !" అని, మంగయ్య యాభై రూపాయిలిచ్చి మరిడయ్య నుంచి పొట్లం ఒకటి తీసుకున్నాడు.



అదే సమయంలో చెంగయ్య పడమటి చెరువు గట్టు దిగువున వున్న జిల్లేడూ, పల్లేరూ, నాగజెముడు పొదల మధ్య వున్న చిన్న గుడిసెలో కాలం గడుపుతున్న మాయల మారెమ్మ దగ్గిరికి వెళ్ళి, "మారెమ్మత్తా, నువ్వు నాకొక చిన్న మేలు చేయాలి. ఎందుకనే, నాకీ మధ్య రాత్రివేళ ఏదైనా జంతువుగా మారి తిరగాలన్న సర్దా కలుగుతున్నది. అందుకేదైనా ఉపాయం చెప్పగలవా?" అని అడిగాడు.

మారెమ్మ, చెంగయ్య కేసి వింత పడుతూ చూసి, "అల్లుడూ, ఒట్టి ఉపాయాలతో పనులయ్యే రోజులు కావివి. నిన్ను ఏ తెల్ల ఏనుగ్గానో, పంచకల్యాణీ గుర్రంగానో మార్చడం, నా తలకు మించిన పని. ఒక్క యాభై రూపాయి లిచ్చుకున్నావంటే, ఒక మందుపొట్లం ఇస్తాను. ఆ మందు మింగితే, రాత్రివేళ కనీసం నాలుగైదు గంటలు నువ్వు, నేవళంగా వుండే గారాబాల గాడిదగా మారగలవు. ఇష్టమేనా?" అని అడిగింది.

చెంగయ్య ఒక్కక్షణం ఆలోచించి, "చీకటి వేళల్లో సరదాగా ఎవరికంటా పడకుండా తిరిగేందుకు, ఏ రూపం అయితే ఏంలే!" అంటూ మారెమ్మకు యాభై రూపాయి లిచ్చి మందు పొట్లం తీసుకున్నాడు.

ఆ రాత్రి మంగయ్య, చెంగయ్య చేలో కాపలాగా లేకపోవడం చూసి, మరిడయ్య యిచ్చిన మందు తిని, గాడిదగా మారి చెంగయ్య జొన్నచేనులో పడి, పైరును కొరికీ, యిష్టం వచ్చినట్టు కాళ్ళతో మట్టగించీ నాశనం చేయసాగాడు.

చెంగయ్య కూడా అదేవేళలో మారెమ్మ యిచ్చిన మందు తిని గాడిదగా మారి, మంగయ్య జొన్నచేనును సర్వనాశనం చెయ్యడానికి పూనుకున్నాడు. ఈ విధంగా రెండు గాడిదలూ తమ శత్రువు జొన్న చేనును నేలమట్టంచేస్తూ, సూర్యోదయానికి కొంచెం ముందు సరిహద్దు గట్టుమీద తల లెత్తి ఒకదాన్నొకటి చూసుకున్నవి.

ఆ సరికి మంగయ్యా, చెంగయ్యా జరిగిందేమిటో గ్రహించారు. ఇద్దరూ పట్టరాని కోపంతో పెద్దగా ఓండ్రపెడుతూ, కాళ్ళతో ఒకళ్ళనొకళ్ళు తన్నుకుంటూ, నోటితో కరుచుకోసాగారు. ఈ గందరగోళం విని, దూరంగా వున్న పంట పొలాల్లోని కాపలా వాళ్ళు ఐదారుగురు పరుగు, పరుగున అక్కడికి వచ్చారు. వాళ్లకు పాడైపోయిన మంగయ్యా, చెంగయ్య పంటపొలాల గట్టు మీద రెండు గాడిదలు పోట్లాడుకోవడం కనిపించింది.

అది సూర్యోదయం కానున్న సమయం. పొరుగు పొలాల కాపలావాళ్ళు కర్ర లెత్తి గాడిదలను కొట్టబోయేంతలో, మందు ప్రభావం పోయిన మంగయ్యా, చెంగయ్యలకు గాడిద రూపాలు పోయి అసలు రూపాలు వచ్చినై.

కాపలావాళ్ళు అది చూసి ముందు ఆశ్చర్యపోయి, తరవాత చీదరించుకుంటూ, "మీరా మంగయ్యా, చెంగయ్యలు! ఛీ, ఛీ, యివేం రూపాలు? మీ శత్రుత్వం యింత నీచానికి దారితీసిందన్నమాట!" అన్నారు.

ఆ మాటలు విన్న మంగయ్య, చెంగయ్యలు అవమానంతో తలలు వంచుకున్నారు. ఇద్దరికీ కళ్ళనీళ్లు తిరిగినై.

ముందు మంగయ్య తల ఎత్తి, చెంగయ్యను సమీపించి ఆప్యాయంగా కావిలించుకుంటూ, "పంట పొలాలు నాశనం చేసుకున్నాం. ఇక మన తిండి గింజల మాటేమిటి?" అన్నాడు బొంగురు పోయిన గొంతుతో.

చెంగయ్య కళ్ళనీళ్లు తుడుచుకుంటూ, "మనం ఇరుగు పొరుగు యిళ్ళవాళ్ళమే కాక, పక్క పక్క పంటపొలాల వాళ్లం కూడా. మనం శత్రుత్వం మాని మిత్రులమైననాడు, ఆ పాటి తిండిగింజలే సంపాయించుకోలేం అంటావా?" అన్నాడు.

ఈ విధంగా బద్ధ శత్రువులైన యిద్దరూ మిత్రులైనందుకు కాపలావాళ్ళు మంగయ్యనూ, చెంగయ్యనూ ఎంతగానో మెచ్చుకున్నారు.





# ఉచ్చనీచలు

బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పరిపాలించే కాలంలో బోధిసత్వుడు ఒక సింహంగా జన్మించాడు. ఆ సింహం ఒక కొండ గుహలో తన భార్యతో కూడా నివసిస్తూండేది. ఒకనాడా సింహం ఆకలిగొనివున్నదై, కొండ మీది నుంచి కిందికి చూసింది. కొండ కింద ఒక కొలను పక్కగల పచ్చిక మైదానంలో దానికి కొన్ని కుందేళ్ళూ, జింకలూ ఆడుకుంటూ, గెంతుతూ కనిపించాయి. వెంటనే సింహం ఒక రంకె పెట్టి కొండ దిగి వాటివేపు ఉరికింది. అలా పోతూ అది కొలను పక్కన ఉండే ఊబిలో పడిపోయింది. ఈలోగా సింహాన్ని చూసి కుందేళ్ళూ, జింకలూ పారిపోయాయి.

ఊబి నుంచి బయటపడటానికి ప్రయత్నించిన కొద్దీ సింహం మరింత లోపలికి దిగబడసాగింది. అందుచేత అది కదలకుండా వుండిపోయి, తనను రక్షించగలవారెవరైనా అటుగా వస్తారా అని ఎదురుచూడసాగింది.

ఆకటితో అలమటించుతూ ఆ సింహం ఒక వారంరోజు లున్నమీదట, పక్కనే వున్న కొలనులో నీరుతాగటానికి నక్క ఒకటి వచ్చి, సింహాన్ని చూసి బెదిరి దూరంగా ఆగిపోయింది.

సింహం నక్కను చూసి, ''నక్క తమ్ముడూ! వారం రోజులుగా ఈ ఊబిలో చిక్కి చచ్చిపోయే స్థితిలో ఉన్నాను. నన్నెలాగైనా కాపాడి పుణ్యం కట్టుకో!'' అని ప్రాధేయపడింది.

''అసలే ఆకలితో ఉన్నావు. నన్ను చంపేస్తావేమో? నిన్నెలా నమ్మటం?'' అన్నది నక్క భయపడుతూ.

''ప్రాణభిక్ష పెట్టిన ప్రాణిని చంపుతానా? నన్ను, ఈ ఊబి నుంచి రక్షించా

తక్కువగానే చూసేది. అయితే నక్క భార్య తన జాతి తక్కువను ఆమోదించి నది కావటం చేత రెండు కుటుంబాల మధ్యా ఎట్టి పేచీలూ రాలేదు. అయితే కాలక్రమాన సింహానికీ, నక్కకూ కూడా పిల్లలు కలిగి, అవి సమంగా ఆడుకుం టుండటం చూసి సింహం భార్యకు మండి పోయింది.

తాము తక్కువనీ, సింహం పిల్లలు ఎక్కువనీ తెలియని నక్క పిల్లలు, సింహం పిల్లలతో కిందా మీదా పడి ఆడు కుంటున్నాయి.

ఉచ్చనీచల విషయం తెలియని సింహం పిల్లలు కూడా నక్కపిల్లలతో సమంగా ఆడుతున్నాయి.

ఇది చూసి ఓర్చలేని సింహం భార్య తన పిల్లలతో చాటుగా, "మనం గొప్ప పుటక పుట్టిన వాళ్ళం. మీ రా నక్క పిల్లలతో అంత చనువుగా ఆడరాదు. వాటిని దూరంగా ఉంచండి!" అని చెప్పింది.

సింహం పిల్లలకు తల్లి బోధ కొంచెం కొంచెమే తలకెక్కసాగింది. అవి నక్క పిల్లలను లోకువగా చూడటమూ, వాటితో ఆడేటప్పుడు అన్యాయం చెయ్యటమూ, "మేము గొప్పవాళ్ళం. మిమ్మల్ని మేము పోషిస్తున్నాము. మాకు మీరు ఎదురు చెప్పకూడదు. మీరు తక్కువవాళ్ళు కనక తిట్టినా పడి ఉండాలి!" అనటమూ సాగించాయి.



ఆడనక్కకు కష్టంవేసి ఒకనాడు తన భర్తతో సింహం భార్య వైఖరి గురించి చెప్పింది. సింహంతో మర్నాడు వేటకు వెళ్ళేటప్పుడు నక్క, "మీది రాచజాతి. మేం సామాన్యులం. అందుచేత మనం కలిసి ఉండటం అంత మంచిది కాదు. మేము వెళ్ళి మా వాళ్ళ మధ్య బతుకుతాం!" అన్నది.

ఆకస్మికంగా తన మిత్రుడిలో కలిగిన ఈ మార్పుకు ఆశ్చర్యపడి సింహం కారణ మడిగింది. నక్క జరిగినదంతా చెప్పింది.

ఆ రాత్రి గుహకు తిరిగి రాగానే సింహం తన భార్యతో, "నువు నక్క పిల్లల్ని చూసి అసహ్యపడ్డావుట కదా?" అని అడిగింది.

"అవును. ఆ తక్కువజాతి పిల్లలు మన పిల్లలతో సమానంగా ఆడుకోవటం నాకేమీ బాగాలేదు. మీకా నక్క ఏమి మందు పెట్టి మంచి చేసుకుందో నాకు తెలీదు. నా పిల్లలు పాడుకావటం మాత్రం నేను ఒప్పను!" అన్నది సింహం భార్య.

"అదా సంగతి? నక్క నాకేం మందు పెట్టిందో చెబుతాను విను: నేను ఒకసారి వారం రోజులు ఇంటికి రాలేదు, జ్ఞాపకం ఉన్నదా? ఆ వారం రోజులూ నేను తిండి లేక మాడుతూ ఊబిలో చిక్కాను. నా ప్రాణాలు పోతున్న సమయంలో ఈ నక్క వచ్చి యుక్తిగా నన్ను ఊబి నుంచి బయటికి లాగింది. ఆనాడు నక్కే నన్ను ఆదుకోకపోతే నేనూ వుండను, మన పిల్లలూ ఉండరు! ప్రాణభిక్ష పెట్టిన వాళ్ళ దగ్గిర ఉచ్చనీచలు పాటిం చడం మహాపచారం. అటువంటి వాళ్ళను అవమానించటం రక్తసంబంధం గల బంధువులను అవమానించటం లాటిదే!" అన్నది సింహం.

సింహం భార్య సిగ్గుపడి నక్క భార్యకు క్షమాపణ చెప్పుకున్నది.

తరవాత ఏడు తరాలదాకా సింహం సంతతీ, నక్క సంతతీ అదే గుహలో ఎంతో సఖ్యంగా కలిసి సుఖంగా జీవిం చాయి.





# బాబర్

టర్కీస్థాన్‌లోని చిన్న రాజ్యమైన ఫెర్గానా యువరాజు బాబర్ 1483 సంవత్సరంలో జన్మించాడు. తండ్రి మరణానంతరం అతడు పదకొండో యేట సింహాసనాన్ని అధిష్ఠించాడు. తండ్రి తరపున తైమూర్ వంశానికీ, తల్లి తరపున చెంఘిజ్ ఖాన్‌కూ చెందిన బాబర్ చాలా చురుకైన వాడు.

తన పూర్వీకుడైన తైమూర్‌కు చెందిన సమర్ఖండ్ నగరాన్ని జయించాలని బాబర్‌కు కోరిక కల్గింది. సింహాసనాన్ని అధిష్ఠించిన అచిర కాలంలోనే సమర్ఖండ్ మీదికి దాడి జరిపాడు. సమర్ఖండ్ సుల్తాన్ ఏమరుపాటుతో వుండడం వల్ల బాబర్‌ను సమర్థవంతంగా ఎదుర్కో లేకపోయాడు.





కాని బాబర్ యుద్ధంలో విజయం సాధించేలోగా అతడి రాజ్యమైన ఫెర్గానాను శత్రురాజులు ఆక్రమించుకున్నారన్న వార్త అందింది. అందువల్ల అతడు వెంటనే వెను దిరగవలసివచ్చింది. కాని ఆ రాజ్యం పొలిమేరలకు సైతం చేరుకోలేక పోయాడు. సైన్యాన్ని కాబూల్ వైపు మళ్ళించి, ఆ ప్రాంతాలను జయించి అక్కడే మకాం చేశాడు.



కాబూల్ నుంచి బాబర్ దృష్టి హిందూస్థాన్ వైపుమళ్ళింది. అప్పటి ఢిల్లీసుల్తాన్ చాలా బలహీనుడు. అతడి అధికారులు ప్రజలను పీడించ సాగారు. అతడి దగ్గరి బంధువులైన ఆలమ్ ఖాన్, దౌలత్‌ఖాన్ ఢిల్లీ సింహాసనం కోసం పాకులాడసాగారు.

ఆలమ్‌ఖాన్, దౌలత్ ఖాన్ కలిసి, భారతదేశం మీదికి దండెత్తి రమ్మని బాబర్‌ను ఆహ్వానించారు. బాబర్ అమితోత్సాహంతో పంజాబు మీదికి దాడిజరిపి లాహోర్‌ను వశపరచుకుని, ఢిల్లీ వైపు పురోగమించాడు. అతణ్ణి ఎదుర్కోడానికి, ఇబ్రహీం లోడీ తొందర, తొందరగా సైనికులనూ, సేనానాయకులనూ. సమీకరించి యుద్ధానికి సిద్ధపడ్డాడు.





ఉభయ సైన్యాలు పానిపట్టు వద్ద యుద్ధానికి దిగాయి. బాబర్ పక్షంలో పన్నెండు వేల సైనికులు మాత్రమే వున్నారు. వాళ్ళందరూ యుద్ధకళలో బాగా శిక్షణ పొందినవారూ, బాబర్ పట్ల ప్రేమాభిమానాలు కలవారూను. ఇబ్రహీం సైనికులు లక్షకు పైగా వున్నారు, కాని వారికి సరైన నాయకుడు లేడు ; క్రమశిక్షణ లేదు. పైగా ఇబ్రహీం పట్ల వారికి నిరసనభావం వుండేది.

అన్నిటికన్నా మించి బాబర్ సైనికులు యుద్ధంలో అసంఖ్యాకంగా తుపాకులను ఉపయోగించారు. తుపాకులు ఢిల్లీ సైన్యానికి కొత్త; అందుబాటులో లేనివి. నిప్పులుకురిసేతుపాకిగుళ్ళను చూడగానే ఇబ్రహీంలోడీ సైనికులు చాలా మంది బెదిరి యుద్ధరంగం నుంచి పారిపోయారు!





మొదటి పానిపట్టు యుద్ధం (1526) గా చరిత్ర ప్రసిద్ధి కెక్కిన ఆ యుద్ధంలో బాబర్ విజయం సాధించాడు. యుద్ధానంతరం బాబర్ తన దగ్గరున్న సంపదను సైనికులకు పంచిపెట్టాడు. ఆ తరవాత స్వదేశానికి తిరిగి వెళ్ళకుండా ఢిల్లీలోనే స్థిరపడ్డాడు.

మరికొన్నాళ్ళకు, బాబర్ ఉదయపూర్‌ను పరిపాలిస్తున్న రాజపుత్ర రాజైన రాణా సంగ్రామ్‌సింగ్‌ను ఎదుర్కొన్నాడు. ఖణ్వా యుద్ధంలో రాజపుత్ర సైనికులు సాహసోపేతంగా పోరాడారు. కాని ఆ యుద్ధంలో కూడా బాబర్ సైనికులు తుపాకులు ఉపయోగించడం వల్ల వేలకొలది రాజపుత్ర సైనికులు రణరంగంలో మరణించారు. బాబర్ గెలుపొందాడు.





ఇబ్రహింలోడీ బలహీనుడే, కాని బలవంతుడూ, ధైర్యసాహసాలకు పేరొందిన రాణాను సైతం గెలవడంతో, అప్పటి ఉత్తర భారతదేశంలో చాలా వరకు బాబర్ అధికారంలోకి వచ్చింది. బాబర్‌కు సాహిత్యమంటే చాలా ఇష్టం. అతడు రానుకున్న స్వీయచరిత్ర చాలా విలువైన పుస్తకం.

బాబర్ కుమారుడు హుమయూన్‌కు ఒకసారి జబ్బుచేసింది. గొప్పగొప్ప వైద్యులు ఎంతో ప్రయత్నించినా వ్యాధినయం కాలేదు. ఆఖరికి బాబర్ తన కుమారుడు పడుకుని వున్న మంచాన్ని మూడుసార్లు ప్రదక్షిణం చేసి, "భగవంతుడా, నా కుమారుని కాపాడు. కావాలంటే ఆ వ్యాధిని నాకు రప్పించి, నన్ను తీసుకో!" అని ప్రార్థించాడు. ఆ క్షణం నుంచి హుమయూన్ కోలుకోసాగాడు.





హుమయూన్ కోలుకునేకొద్దీ బాబర్ ఆరోగ్యం క్షీణించసాగింది. 1530వ సంవత్సరం అతడు మరణించాడు. బాబర్ తల్లి పూర్వీకులు మంగోలు వంశానికి చెందడం వల్ల, అతడి వంశానికి మొగల్ వంశమని పేరు వచ్చింది. భారతదేశంలో బాబర్‌తో ప్రారంభమైన మొగల్ సామ్రాజ్యం 1857వ సంవత్సరం వరకూ కొనసాగింది.



# యువరాజు మౌనం

వజ్రపురి రాజు వజ్రకేతుడికి ఇద్దరు కుమారులు. వారిలో పెద్దవాడు చిన్నతనంలో చాలా ఉత్సాహంగానూ, మాటకారిగానూ వుండేవాడు. కాని వయసు పెరిగేకొద్దీ క్రమక్రమంగా అతనిలో మితిమించిన శాంతగుణమూ, మౌనస్వభావమూ చోటు చేసుకున్నాయి. ఇది రాజుకు తీరని విచారాన్ని కల్గించింది.

ఒకరోజు ఆయన మంత్రీ, రాజగురువులతో తన పెద్దకుమారుడి మౌనస్వభావాన్ని మార్చడానికి ఆలోచన జరిపాడు. రాకుమారుణ్ణి బాగా మాట్లాడించిన వారికి బహుమతులు ప్రకటించే విషయమై గురువుగారి సలహా అడిగాడు.

రాజు మాటలు సాంతం విన్న గురువు, "రాజా, యువరాజు మామూలు విషయాలపట్ల ముభావంగా వుండడం గురించి మీరు ఇంతగా విచారించనవసరం లేదు. ఎందుకంటే అతడు మూగకాదు; మౌని అంతకన్నా కాదు. కాకుంటే కొందరిలో అరుదుగా వయసుకు మించిన ఆలోచనలు వుండడం వల్ల, ఇలాంటి స్వభావం ఏర్పడుతుంది. పైగా ఇటువంటి మితభాషులు కొందరు కారణ జన్ములుగానూ వుంటారు. లోగడ మన పొరుగు రాజ్యమైన నీలాపురి యువరాజు రవిచంద్రుణ్ణి మాట్లాడించడానికి మీలాగే అతని తండ్రి చేసిన ప్రయత్నాలు మీకు తెలియదనుకుంటాను," అంటూ ఇలా చెప్పసాగాడు :

నీలాపురి రాజదంపతులకు లేక లేక చాలా కాలానికి ఒక కొడుకు పుట్టాడు. వారు ఆ బిడ్డకు రవిచంద్రుడని పేరు పెట్టి అల్లారు ముద్దుగా పెంచసాగారు.

పెరిగేకొద్దీ, రవిచంద్రుడిలో అందచందాలతోపాటు తెలివితేటలూ దినదినాభివృద్ధి చెందసాగాయి. అతని అలవాట్లూ,

రావులపాటి ప్రసాద్




ప్రవర్తనా పదిమందీ మెచ్చుకునే విధంగా వుండేవి. కాని పన్నెండేళ్ళు నిండినా, అతని నోటినుంచి ఒక్కమాట కూడా రాలేదు. ఎప్పుడు చూసినా ఏదో తీవ్రంగా ఆలోచిస్తున్నట్టు కనిపించే వాడు. అప్పుడప్పుడూ చిన్నగా నవ్వేవాడు. ఇంతకూ రవిచంద్రుడు మూగవాడా అంటే అదీ కాదు. ఎందుకంటే ఒకటి రెండుసార్లు ఏకాంతంగా వున్నప్పుడు అతనికి మాత్రం వినిపించేట్టు, ఏవో పాటలు పాడుకోవటం గమనించిన కొందరు సేవకులు, ఆ విషయం రాజుగారికి తెలియజేశారు.

రవిచంద్రుడి మౌన ప్రవర్తన రాజుకు చాలా విచారం కల్గించింది. యువరాజును మాట్లాడించిన వారికి కోరిన బహుమతులు ఇస్తానని చాటింపు వేయించాడు.

ఆ చాటింపు విని దేశ దేశాల నుంచి చాలామంది నిపుణులు యువరాజును మాట్లాడించడానికి వచ్చారు. పేరుమోసిన వైద్యులు కొందరు వివిధ ఔషధాలను ఉపయోగించి యువరాజును మాట్లాడించడానికి ప్రయత్నించారు. మరి కొందరు సుప్రసిద్ధ పండితులు వాదోపవాదాలు వినిపించి యువరాజు నోటినుంచి మాట రాబట్ట డానికి ప్రయాసపడ్డారు. ఇంకా కొందరు మంత్ర తంత్రాలతో రవిచంద్రుణ్ణి మాట్లాడించడానికి పూనుకున్నారు, కాని వారి ప్రయత్నాలేవీ ఫలించలేదు.

ఒకరోజు మధ్యాహ్నం భోజనాలయిన తరవాత, యువరాజు ఉద్యానవనంలోకి వెళ్ళి ఒక చెట్టునీడలో కూర్చున్నాడు. అతడి వెంట వచ్చిన సేవకుడు కొద్ది దూరంలో నిలబడ్డాడు. కొంతసేపయ్యాక ఒక చిలుక వచ్చి, చెట్టుకొమ్మ మీద వాలి కిల కిల మనసాగింది. చిలుక చేసేశబ్దం, యువరాజుకు ఇబ్బంది కలిగిస్తుందని సేవకుడు చిన్న రాయితీసి దానిమీదికి విసిరాడు. చిలుక కీచు కీచుమంటూ నేలమీద పడింది.

వెంటనే యువరాజు ఆ పక్షి దగ్గిరకు పోయి, దాన్ని చేతిలోకి తీసుకుని, మృదు

వుగా నిమురుతూ, "ఎందుకమ్మా, అరి చావు? అరవడం వల్లేకదా, నీకీగాయం తగిలింది!" అని ప్రేమగా బుజ్జగించ సాగాడు.

అదిచూసి సేవకుడు ఉత్సాహంతో, "యువరాజుగారు మాట్లాడారు! యువ రాజుగారు మాట్లాడారు!" అని అరుస్తూ అంతఃపురం కేసి పరిగెత్తాడు.

విషయం తెలుసుకున్న రాజూ, రాణీ అమితోత్సాహంతో ఉద్యానవనంలోకి వచ్చారు. వారివెంట, పరివారమంతా ఉద్యానవనం చేరింది. అయినా, వాళ్ళు అక్కడికి వచ్చేలోపల పక్షి ఎగిరిపోయింది. యువరాజు యథాప్రకారం మౌనంగా కూర్చుని వున్నాడు.

రాజుకు సేవకుడి మీద పట్టరాని కోపం వచ్చింది. "అబద్ధం చెప్పిన ఈ నీచుణ్ణి ఉరితీయండి!" అని ఆజ్ఞాపించాడు.

"నేను అబద్ధం చెప్పలేదు మహారాజా! నిజంగానే యువరాజు మాట్లాడ్డం విన్నాను," అన్నాడు సేవకుడు. కాని రాజభటులు వాణ్ణి బంధించబోయారు.

వాడు వెంటనే యువరాజు కాళ్ళపై బడి, "యువరాజా! ఏ తప్పూ చేయని నాకు, నిజం చెప్పినందుకు ఉరిశిక్ష పడుతూ వుంటే చూస్తూ ఊరుకోవడం న్యాయమా? చిలుక గాయపడడం చూసి కరిగిన మీ హృదయం, నాకు మరణ దండన విధించినా మౌనం వహించడం, ధర్మమా? దయచేసి ఒక్కసారి మాట్లా



డండి. నన్ను కాపాడండి,'' అని ప్రాధేయపడసాగాడు.

యువరాజు వాణ్ణి నెమ్మదిగా లేవనెత్తి, ''మాట్లాడడం వల్లేకదా నీకీకష్టం వచ్చింది! మౌనంగా వుంటే ఏ బాధలూ వచ్చేవి కాదుకదా?'' అన్నాడు.

యువరాజు మాట్లాడ్డం విన్న రాజు, సేవకునికి తన హారాన్ని తీసి బహుమతిగా ఇచ్చాడు. కాని ఆరోజు రాత్రే రవిచంద్రుడు, మామూలు జీవితసుఖాలను వదులుకుని, సన్యాసం పుచ్చుకోడానికి వెళ్ళిపోయాడు.

గురువుద్వారా రవిచంద్రుణ్ణి గురించి విన్న రాజు వజ్రకేతుడు తన కుమారుణ్ణి సరిఅయిన మార్గంలో పెట్టే బాధ్యత అతనికి అప్పగించాడు.

రాజగురువు యువరాజును తన వెంట బెట్టుకుపోయి, వారం రోజులు తరవాత తిరిగి రాజదర్శనానికి వచ్చాడు. యువరాజు తండ్రిని చూస్తూనే నమస్కరించి, ''నాన్నగారూ, మా గురుకులాన్ని ఎప్పుడైనా చూశారా? అక్కడ నాకు ఎంతమంది స్నేహితులనుకున్నారు!'' అన్నాడు.

కొడుకు యిలా మాట్లాడడం విన్న రాజు సంతోషంతో గురువును ''వారం రోజులు తిరక్కుండానే యువరాజు ప్రవర్తనలో యింత గొప్ప మార్పు ఎలా తీసుకురాగలిగారు?'' అని అడిగాడు.

''మహారాజా, మీరు యువరాజును అంతులేని ముద్దుమురిపాలతో పెంచారే తప్ప, ఆ వయసులో వున్నవాళ్ళకు తప్పని సరిగా అవసరం అయిన స్నేహితుల్ని యివ్వలేకపోయారు. తల్లిదండ్రులూ, వయసులో పెద్దవాళ్లూ అయిన సేవకులతో యువరాజు తనకిష్టమైన దేన్ని గురించి మాత్రం మాట్లాడగలడు? కాని, గురుకులంలో చేరి తన వయసువాళ్ళే అయిన యితర రాజోద్యోగుల పిల్లలు సహాధ్యాయులుగా లభించేసరికి, తాను ఒంటరిగాడినన్న భావం పోయింది. దానితో పాటు మౌనంగా వుండే లక్షణం కూడా మాయమైంది,'' అన్నాడు రాజగురువు.





# పాడే పిశాచం - ఆడే పిశాచం

చిదంబరానికి కంట్లో పూలు వేసి, చూపు పోయింది. నిత్యానందానికి పుట్టెడు చెముడు. ఇద్దరూ పెళ్ళిళ్ళు చేసుకుని, యాచకవృత్తితోనే పెళ్ళాలను పోషిస్తున్నారు.

వాళ్ళ ఊరుకు పదికోసుల దూరంలో రంగనాయకులగుడి వున్నది. అక్కడ ప్రతి సంవత్సరం పెద్ద ఎత్తున స్వామివారి ఉత్సవాలు జరుగుతాయి. కొండకూ తమ ఊరికీ మధ్య వున్న చిట్టడివి దాటి చిదంబరం, నిత్యానందం ఆ కొండ మీద నాలుగు రోజులపాటు వుంటారు. గుడి మెట్లపక్కన గుడ్డపరుచుకు కూర్చుంటే, సాయంకాలానికల్లా గుప్పెడు రూకలు మూటకట్టుకోవచ్చు.

ఆ ఏడు కూడా వాళ్ళిద్దరూ తిరునాళ్ళలో చెరో వంద సంపాయించుకుని, ఊరుకు తిరుగుప్రయాణమయ్యారు.

అయితే, అప్పటికే బాగా చీకటిపడి పోవడంతో చిట్టడవిలో వాళ్ళ ప్రయాణం బాగా సాగలేదు.

''ఒరే, చిదంబరం! మనం కాస్త ముందుగా బయలుదేరవలసింది. దారిలో పాముపుట్రా—అర్ధరాత్రికయినా అడవి దాటకపోతే చాలా చిక్కుల్లో పడిపోతాం,'' అన్నాడు నిత్యానందం చుట్టూ వున్న కటిక చీకట్లోకి భయం, భయంగా చూస్తూ.

చిదంబరం అవునన్నట్టు తల వూపి, నిత్యానందం చెయ్యి పట్టుకున్నాడు. ఇద్దరూ వేగంగా నడవసాగారు. కొంత దూరం పోయాక హఠాత్తుగా ఒక చోట పెద్ద కోలాహలం రేగింది. చిదంబరం, నిత్యానందం చేతిని మరింత గట్టిగా వడిసిపట్టుకుని, ''ఏమిటా గొడవ?'' అని అడిగాడు.

మాచిరాజు కామేశ్వరరావు



అ పొగడ్తకు మగపిశాచి పొంగిపోయింది.

నిత్యానందం తానూ చప్పట్లుచరిచి, ''అమోఘమైన నాట్యం! నెమలికైనా నేర్వడం అసాధ్యం అనిపించేలా వున్నది.'' అన్నాడు.

ఆడపిశాచికి అ పొగడ్త అనందాన్ని కలిగించింది. అయితే, తన పాటను నిత్యానందం మెచ్చుకోనందుకు కోపగించుకున్నది మగపిశాచం. తన ఆటను చిదంబరం పొగడనందుకు ఆడపిశాచం ఉడుక్కున్నది.

అ సరికి నిత్యానందం ఆ కోలాహలానికి కారణమైన పిశాచాలను చూసి నిలువునా వణికిపోసాగాడు. ఒక మగపిశాచి గొంతెత్తి భీకరంగా పాడుతూంటే, ఒక ఆడపిశాచి దానికి తగ్గట్టు అడుగులు వేస్తూ, అడవి అదిరిపోయేలా నాట్యం చేస్తున్నది.

నిత్యానందం చెప్పగా సంగతి తెలుసుకున్న చిదంబరం తానూ వణికిపోతూ, ''పొగడ్తకు పొంగిపోని ప్రాణి ఎక్కడుంటుంది? పిశాచాలే అవుగాక!'' అన్నాడు.

తరవాత అతడు గట్టిగా చప్పట్లు చరిచి, ''అద్భుతమైన పాట! కొబ్బరి నీళ్ళలో కలకండ కలిపి తాగినట్టుగా వున్నది.'' అన్నాడు.

అది చిదంబరాన్ని, ''ఆయన పాట తప్ప, నా ఆట నిన్ను అకర్షించలేదా?'' అని అడిగింది.

''నీ ఆట చూసి ఆనందించే అదృష్టం లేని గుడ్డివాణ్ణి. ఈ క్షణానే చచ్చిపోవాలనుకుంటున్నాను!'' అన్నాడు చిదంబరం.

మగపిశాచం నిత్యానందాన్ని, ''ఆవిడగారి ఆట తప్ప, నా పాట నీకు ఆనందం కలిగించలేదా?'' అని అడిగింది.

చెవిటివాడైన నిత్యానందానికి మగపిశాచి అడిగిందేమిటో అర్థం కాలేదు. చిదంబరం కల్పించుకుని, ''ఈ చెవిటి మాలోకానికి పాట పసందుగా వున్నదీ లేనిదీ, ఎలా తెలుస్తుంది!'' అన్నాడు.

ఆ జవాబుతో పిశాచాలకు వాళ్ళల్లో ఒకడు గుడ్డివాడనీ, రెండవవాడు చెవిటి వాడనీ తెలిసిపోయింది.

ఆడపిశాచి చిదంబరం కళ్ళల్లోకి చల్లటి మంచులాంటి గాలిని ఊదింది. మగ పిశాచి నిత్యానందం చెవిలో గూబ అదిరి పోయేలా పొలికేక పెట్టింది.

ఆశ్చర్యం! మరు క్షణమే చిదంబ రానికి కళ్ళు కనిపించసాగాయి; నిత్యా నందానికి చెవులు వినిపిస్తున్నాయి. మళ్ళీ మగపిశాచి పాట అందుకున్నది. ఆడ పిశాచి ఆట ఆరంభించింది. కంపరం పుట్టిస్తున్న వాటి ఆటపాటల్ని మరి కొంత సేపు మెచ్చుకుని, యిద్దరూ సంతోషంగా ఊరిదారిపట్టారు.

వాళ్ళు ఊరు చేరేసరికి బాగా తెల్లవారి పోయింది. వాళ్ళ యిళ్ళు పక్క, పక్క వీధుల్లో వున్నవి. చిదంబరం కళ్ళు మూసుకు నడిస్తేతప్ప, తన వీధిలోని ఇంటిని గుర్తించలేకపోయాడు. అతడు తలుపు తట్టేసరికి చాలా అనాకారిగా వున్న స్త్రీ ఒకతె వచ్చి తలుపు తెరిచింది.

చిదంబరం ఆమెకేసి ఏవగింపుగా చూస్తూ, ''చింతామణి అనే ఆవిడ యిల్లెక్కడ ?'' అని అడిగాడు.

చింతామణి అతడి భార్య పేరు. తలుపు తెరిచింది ఆవిడే!

భర్తకు చూపు వచ్చిన సంగతి తెలుసు కుని ఆమె పరమానందం చెంది. ''నేనే చింతామణిని! నీకు కళ్ళు వచ్చాయనే



వంటే, నీకు బతికి ఉన్నన్నాళ్ళూ కృతజ్ఞతగా వుంటాను. నా మాట నమ్ము!'' అన్నది సింహం.

నక్క సింహం మాటలు నమ్మి, ఎండు కట్టెలను తెచ్చి ఊబిలో పడవేసింది. వాటిమీద కాళ్ళు ఊన్చి సింహం ఊబిలో నుంచి బయటికి రాగలిగింది.

తరవాత రెండూ కలిసి అరణ్యంలో వేటకు బయలుదేరాయి. సింహం ఒక జంతువును చంపింది. దాన్ని రెండూ సమంగా పంచుకు తిన్నాయి.

''ఇకనుంచీ మనం సోదరులం! నువ్వొకచోటా నే నొకచోటా ఉండటం దేనికి? నీ కుటుంబాన్ని మా గుహకే తీసుకురా! అందరం కలిసికట్టుగా జీవింతాం!'' అన్నది సింహం. నక్క అంగీకరించి, భార్యతోసహా సింహం గుహలో కాపరం పెట్టింది.

సింహం వెంట తాను కూడా కాపరం చెయ్యటం గొప్పగా ఉంటుందని నక్క ఈ ఏర్పాటుకు ఒప్పుకున్నదే గాని, తన జాతివారికి దూరమైపోవటంలోగల నష్ట కష్టాలు తెలియక కాదు. సింహం కూడా నక్క చేసిన త్యాగాన్ని అర్థం చేసుకుని, ప్రతి స్వల్ప విషయంలోనూ తన మిత్రుణ్ణి తనతో సమంగా చూసుకుంటూ, నక్క మనసుకు ఏ మాత్రమూ బాధ కలగకుండా ప్రవర్తిస్తూ రోజులు గడపసాగింది.

సింహం నక్కను ఎంత ప్రేమతో చూసినా సింహం భార్య నక్క భార్యను





ఆనందంలో, నా నోటమాట పెగలడం లేదు,'' అన్నది.

ఆ అనాకారి స్త్రీ తన భార్య అని నమ్మలేకపోయాడు, చిదంబరం. అయితే, కంఠస్వరాన్నిబట్టి, ఆమే తన భార్య అని తెలుసుకున్నాడు. ఇంతకాలంగా ఆ వికారిమనిషితో తాను కాపురం చేసినందుకు అతడికి కంపరం పుట్టుకొచ్చింది. కాని, భార్య యీ శుభవార్త యిరుగు పొరుగులకు చెప్పేందుకు పరుగుతీసింది.

ఇక నిత్యానందం తన ఇల్లు చేరి, ఒకటికి, రెండుసార్లు తలుపు తట్టాక, ''వస్తున్నా! వస్తున్నా!'' అన్న కరుకైన మగకంఠస్వరం లాంటిది వినిపించింది.

''ఏదో మగకంఠం వినబడుతున్నది, ఎవరు వచ్చారు?'' అని అడిగాడు నిత్యానందం భార్యను.

భర్తకు చెవుడుపోయి, మాట వినబడుతున్నందుకు పొంగిపోయిన కాంతం, ''దేవుడి దయవల్ల నీకు చెవులు వినిపిస్తున్నాయన్నమాట! నా గొంతుతీరే అంత,'' అన్నది.

ఆ, కంఠస్వరం భరించలేని నిత్యానందం, ''అలాగా! అయితే, అది తరచూ వినడం జరిగితే, నాకు మళ్ళీ చెముడు వస్తుంది. ఇక, నా ముందు ఎన్నడూ పెదవివిప్పకు, జాగ్రత్త!'' అన్నాడు.

అతడి భార్య గుడ్లనీరు కుక్కుకుంటూ లోపలికి వెళ్ళిపోయింది.

ఆ రాత్రి అడవి దారిపట్టి పోతున్న నిత్యానందాన్ని, దారిలో చిదంబరం కలుసుకున్నాడు. ఇద్దరూ ఒకరి కష్టాలొకరు చెప్పుకుని, పిశాచాలే తమ కష్టాలను తొలగించాలనుకున్నారు.

వాళ్ళు వెళ్ళేసరికి, యీసారి ఆడపిశాచి పాడుతున్నది, మగపిశాచి ఆడుతున్నది. వాళ్ళను చూస్తూనే అవి ఆటా, పాటా కట్టిపెట్టి, ''మళ్ళీ వచ్చారేం! సంగతేమిటి?'' అని అడిగినై.

''నా భార్య పరమకురూపి! నేను కాపరం చెయ్యలేను. కంటిచూపు

తెప్పించి, మీరే యీ గొడవకు కారణం అయ్యారు. పరిష్కారం మీరే చెయ్యాలి,'' అన్నాడు చిదంబరం.

''మగగొంతున్న ఆడమనిషి అన్ని అరిష్టాలకూ కారకురాలవుతుంది. నా భార్య గొంతు భరించలేను. మీరే ఏదైనా దారిచూపాలి,'' అన్నాడు నిత్యానందం.

పిశాచాలు తెల్లబోయి ముఖముఖాలు చూసుకుని, ''ఇన్నాళ్ళూ, వాళ్లు మిమ్మల్ని ప్రేమగానే చూసుకుంటున్నారు గదా?'' అని అడిగినై.

''అవును, యిప్పుడూ అలాగే చూస్తున్నారు. ఎటొచ్చీ వాళ్ళ రూపం, కంఠస్వరాలే చిరాకు కలిగిస్తున్నవి,'' అన్నారు చిదంబరం, నిత్యానందం.

''ఇంతవరకూ మీకున్న లోపాలను వాళ్ళేం పట్టించుకోకుండా, ఎంతో ఆదరంగా చూశారు. వాళ్ళ మనసులు ఎంత మంచివో ఆలోచించి చూడండి!'' అన్నది మగపిశాచం.

ఆ మాట నిజం కావడంతో యిద్దరూ జవాబు చెప్పలేకపోయారు.

అప్పుడు మగపిశాచం, ''శారీరకంగా వుండే లోపాలు సరిదిద్దుకోలేనివి. అవి వున్నవారిని అసహ్యించుకోవడం, క్షమించరాని నేరం. జీవితం అంతా కలిసి వుండవలసిన భార్యాభర్తల మధ్య వుండవలసింది ప్రేమా, ఒకరిపై ఒకరికి ఆదరణ. మీరు, మీ భార్యల అందచందాల్ని కాక, వాళ్ళ గుణగణాల్ని గౌరవించడం నేర్చుకోండి,'' అన్నది.

ఆ మాటలతో నిత్యానందానికి, అక్షణంలోనే తన చెముడు పోయినట్టనిపించింది. చిదంబరం అప్పుడే తన గుడ్డితనం పోయినవాడిలా పిశాచాల కేసి ఆప్యాయంగా చూశాడు.

ఇద్దరూ పిశాచాలకు వంగి నమస్కరించి, ''మాకు సరైన బుద్ధి చెప్పినందుకు, బతికున్నంతవరకూ మీకు కృతజ్ఞులం!'' అని, అప్పటికప్పుడే ఇంటి దారిపట్టారు.





# సత్యంమహిమ

నవనీతపురాన్ని సత్యశీలుడనే రాజు ఏలుతూ ఉండేవాడు. అతడు పేరుకు తగినట్టే సత్యాన్ని నిష్ఠగా పాటిస్తూ, ధర్మ పరుడై ఆదర్శంగా జీవిస్తూ వచ్చాడు. సత్యశీలుడి ఇంట లక్ష్మి, యశస్సూ, ధర్మమూ, సత్యమూ, శౌచమూ మొదలైనవి ఇల్లుకట్టుకున్నాయని చెప్పుకునేవారు.

వర్తకం పెంపొందితే దేశ సంపద పెరిగి జనులు సుభిక్షంగా ఉంటారనే ఉద్దేశంతో సత్యశీలుడు ఒక ఆచారం అమలు చేశాడు. అతడు ప్రతి ఉదయమూ తొలిగా తన ప్రాంగణానికి వచ్చి ఎవరు ఏ సరుకు విక్రయించినాసరే, బేరం ఆడకుండా కొంటూ ఉండేవాడు. వర్తకంలో దెబ్బతిన్నవాళ్ళూ, అమ్ముడుకాక సరుకు దిగబడిపోయి నష్టపడినవాళ్లూ ఉదయమే తమ సరుకును రాజుగారికి అమ్మి తమ నష్టం కొంతవరకు పూడ్చుకునేవారు.

నవనీతపురంలో ఒక నిరుపేద బ్రాహ్మణుడుండేవాడు. అతణ్ణి దారిద్ర్యం పట్టి ఎన్ని ప్రయత్నాలు చేసినా వదిలింది కాదు. "ఈ దారిద్ర్యం ఎవరూ కొనని సరుకులాగా నన్ను వదలకుండా ఉన్నదే. దీన్ని నేను వర్తక ధర్మంలో రాజుగారికి ఎందుకు అమ్మరాదూ?" అనుకున్నాడు బ్రాహ్మణుడు.

ఆయన ఒకనాడు తన దారిద్ర్యానికి చిహ్నాలయిన చింకి పాతలూ, చినిగిన గొంగళీ, చిల్లుల చెప్పులూ ఒక మూట గట్టి, దాన్ని నెత్తిన పెట్టుకుని, తెల్లవారకముందే రాజుగారి ఇంటిముందు నిలబడి, "దారిద్ర్యం, దారిద్ర్యం! ఎవరైనా కొంటారా?" అని కేక పెట్టాడు.

రాజుగారా కేక విని, "ఎవరో సరుకు అమ్మకానికి తెచ్చినట్టుంది. నా దగ్గిరికి పిలుచుకురా!" అని భటుణ్ణి పంపాడు.

బ్రాహ్మణుడు వచ్చి తన నెత్తి మీది మూట దించి, "మహారాజా, నా కున్న దంతా అమ్మకానికి తెచ్చాను," అంటూ మూట చూపాడు.

"అలాగా? ఆ మూటలో ఉండే సరు కేమిటి?" అన్నాడు రాజు.

"దారిద్ర్యం, మహారాజా! నా సొంత దారిద్ర్యం," అన్నాడు బ్రాహ్మణుడు.

రాజు ఒక్క క్షణం ఆలోచించాడు. బ్రాహ్మణుడు వర్తకధర్మంలోనే మాట్లాడాడు. ఏ వర్తకుడైనా తనకు ఉపయోగం లేని సరుకునేగద విక్రయిస్తాడు.

ఈ విధంగా ఆలోచించి సత్యశీలుడు బ్రాహ్మణుడితో, "అయ్యా, నీ దారిద్ర్యాన్ని ఎంతకు అమ్ముతావు?" అన్నాడు.

"అయిదువందల వరహాలకు అమ్ముతాను," అన్నాడు బ్రాహ్మణుడు.

రాజు బ్రాహ్మణుడికి అయిదు వందల వరహాలూ ఇప్పించి అతని చింకిపాతల మూటను తన సామాన్ల కొట్లో పెట్టించాడు.

ఆ రాత్రి రాజు నిద్రపోతుండగా ఒక కల వచ్చింది. ఆ కలలో ఒక దేవతాస్త్రీ లాటి మనిషి తన ఇంటి లోపలినుంచి బయటికి పోతూ అతనికేసి వచ్చింది.

"ఎవరమ్మా నీవు? ఎప్పుడు మా ఇంటికి వచ్చావు? ఎందుకు పోతున్నావు?" అని సత్యశీలు డామెను అడిగాడు.



"నేను లక్ష్మిని. ఇంతకాలమూ నీ ఇంట ఎంతో సంతోషంతో ఉన్నాను. కాని ఇవాళ నీవు దారిద్ర్యాన్ని కొని తెచ్చి ఇంట పెట్టుకున్నావు. అందుచేత నేనిక నీ ఇంట ఉండదలచలేదు," అన్నదామె.

"నీ యిష్టం. నేను రమ్మంటే నీవు రాలేదు, బుద్ధిపూర్వకంగా వచ్చావు. తగిన కారణం ఉండే వెళుతున్నావు. నేను ఆక్షేపణ చెయ్యలేను," అన్నాడు సత్యశీలుడు.

లక్ష్మి వెళ్ళిపోయిన మరుక్షణమే అతనికి మరొక స్త్రీ కనిపించింది. ఆమె కూడా బయటికి పోతూండటం చూసి, అతనామెను లక్ష్మిని అడిగినట్టే అడిగాడు.

"నేను ధర్మాన్ని. లక్ష్మి వెళ్ళినాక నేనుండి, నీకేమీ ఉపయోగం లేదు. లక్ష్మి ఉండబట్టే నీ వింత కాలమూ నన్ను నిలబెట్టుకోగలిగావు," అన్నది ధర్మదేవత.

అలాగే న్యాయదేవత కూడా వెళ్ళి పోతూ, "ధర్మం లేనిచోట న్యాయం మాత్రం ఎలా ఉంటుంది?" అన్నది.

తరవాత కీర్తిదేవత కూడా రాజు దగ్గిర సెలవు తీసుకుని వెళ్ళిపోయింది. తనను అభిమానించిన దేవతలందరూ తనను విడనాడిపోయారని సత్యశీలుడు అనుకుంటూండగా మరొక దేవత కూడా బయటికి వచ్చింది.

"అమ్మా, నీవెవరు? ఎందుకు వెళ్ళి పోతున్నావు?" అని సత్యశీలుడు అడిగాడు.

"నేను సత్యాన్ని. మిగిలిన వాళ్ళందరూ వెళ్ళిపోయాక, నా మీద నీకు పూర్వం ఉండిన ఆదరం ఇకముందు ఉండదేమోనని అనుమానం వేసి నేను కూడా వెళ్ళి పోతున్నాను," అన్నది ఆ దేవత.

"అమ్మా, నీ వుంటే చాలుననే కదా మిగిలినవారందరినీ పోగొట్టుకోవటానికి సిద్ధపడ్డాను? వారందరూ వెళ్ళటం సక్రమంగా ఉంది. కాని నీవు వెళ్ళటం సరి కాదు. నా మాట నమ్మకపోతే న్యాయదేవతను అడిగిరా," అన్నాడు సత్యశీలుడు.

"నీ వల్ల నాకే అపచారమూ జరగలేదు. అందుచేత నేను నిన్ను విడిచి పోను," అంటూ సత్యం తిరిగి లోపలికి వెళ్ళిపోయింది.

వెంటనే దేవతలంతా ఒక జట్టుగా లోపలికి వస్తూ రాజుకు కనిపించారు. "అందరూ నాతో అసంతృప్తి చెంది వెళ్ళిపోయారుగదా! ఏం, తిరిగి వస్తున్నారు?" అని రాజు వారిని అడిగాడు.

"సత్యం ఉండేచోట మేం ఉండక తప్పదు. మాతోబాటు సత్యం కూడా వచ్చేస్తుందనుకున్నాం, రాలేదు. అందుచేత మేమే సత్యం ఉన్న చోటికి తిరిగి వస్తున్నాం," అన్నారు వాళ్ళు.






క్షీరసాగరమథన సమయంలో, రాక్షసులు దేవతలను పరిహాసం చేస్తూ, తమ భుజ బలం అంతా చూపిస్తూ లాగారు. దేవతలు కూడా మా తక్కువేమీ లేదని లాగారు. మథనం మహావేగంతో సాగింది. ఆ రాపిడికి తట్టుకోలేక వాసుకి మహాసర్పం హాలాహల మహా విషాన్ని కక్కింది.

హాలాహలం జ్వాలలు విరజిమ్ముతూ చెలరేగింది. రాక్షసులు చాలా మంది మలమలమాడి మసి అయ్యారు. హాలాహల మహాగ్ని విజృంభించి లోకాన్ని దహించే ప్రమాదం ఏర్పడింది. అదే సమయంలో మందరపర్వతం సముద్రం లోకి కృంగిపోయింది. అందరూ హరహరా అని శివుణ్ణి ప్రార్థించారు.

శివుడు హాలాహలాన్ని మ్రింగి, గొంతు లోనే ఉంచి లోకాల్ని రక్షించాడు, గరళ కంఠుడనిపించుకున్నాడు. గండం తప్పిందిగాని, పర్వతం మునిగిపోయింది. దేవతలు విష్ణువును ప్రార్థించారు.

విష్ణువు పెద్ద తాబేలుగా కూర్మావతారం తాల్చి సముద్రంలో కృంగిపోయిన మందరపర్వతాన్ని మూపున మోస్తూ మీదకు తెచ్చాడు.

తాబేలై మందరగిరిని మోస్తూ క్రిందనూ, పర్వతం అటూ ఇటూ బెసక్కుండా పర్వతాగ్రంపై కూర్చొని పాదంతో అదిమి పెట్టుతూ మీదనూ, ఇంకోవంక దేవతలతో కలిసి సముద్రం చిలుకుతూ బహు రూపాలతో విష్ణువు కనిపించాడు.

4. కూర్మావతారం—జగన్మోహిని



చిట్ట చివరకు అమృతం సిద్ధించింది. విష్ణువు ఆయుర్వేదానికి మూల విరాట్టు అయిన ధన్వంతరి అవతారంతో, అమృత కలశాన్నీ, అనేక ఓషధులనూ ధరించి, పద్మాసనంపై కూర్చొని, సముద్రం నుంచి వచ్చాడు.

అమృతం కోసం పాలసముద్రాన్ని తరిస్తే ప్రారంభంలో హాలాహల విషం పుట్టింది. ఎన్నెన్నో విశేషాలు, దైవసహాయాలు జరిగాక అమృతం సిద్ధించి లక్ష్యసాధన అయింది. అందుకే ఏదైనా శమదమాదులతో కూడిన కార్యసాధనకు 'సాగర మథనం' అనే మాట పర్యాయపదంగా నిలిచింది.

సాగర మథనం సక్రమంగా సాగింది. క్షీరసాగరం నుంచి చంద్రుడు, లక్ష్మి, కల్పవృక్షం, కామధేనువు, ఐరావతం ఏనుగు, ఉచ్చైశ్శ్వం గుర్రం, సుర అనే మత్తూ, ఉత్తేజమూ కల్గించే పానీయమూ, ఇంకా ఎన్నెన్నో ఉద్భవించడం జరిగింది.

చల్లని చంద్రుణ్ణి శివుడు కంఠంలోని హాలాహలం వేడికి ఉపశమనంగా తలపై ధరించి, చంద్రశేఖరుడయ్యాడు.

లక్ష్మీదేవి శ్రీవత్సకౌస్తుభ మణులతో కూడిన వైజయంతిమాలను వేసి విష్ణువును వరించింది. విష్ణువు లక్ష్మీకాంతుడయ్యాడు.

సురను దేవతలు స్వీకరించి సురులు అనిపించుకున్నారు.

ధన్వంతరి చేతనున్న అమృత కలశాన్ని రాక్షసులు ఎగరేసుకుపోయి అంతా మాదే అన్నారు. దేవతలు వాళ్ళతో పెనగులాడారు. దేవదానవుల పెనగులాట ముమ్మరంగా సాగుతున్న ఆ సమయంలో, ముజ్జగాలను సమ్మోహపరిచే జగన్మోహిని అక్కడకు వచ్చింది. ఆమెను చూసి రాక్షసులు పరవశించిపోయారు.

మోహిని రాక్షసులతో, ''అమృతాన్ని ఇలా తెండి, నేను పంచుతాను!'' అంది.

జగన్మోహిని తమతో మాట్లాడినందుకే రాక్షసులు ఉప్పొంగిపోతూ, అమృత కలశను ఆమెకు అందించారు.

రాక్షసులు ఒక వరసను, దేవత లోక వరసను కూర్చున్నారు. ఉభయశ్రేణుల నడుమ జగన్మోహిని నృత్యం చేస్తున్నట్లు అడుగులు వేస్తూ, అమృతకలశాన్ని నడుమున ఆనించి పంచడానికి తయారైంది.

ఏమి జరుగుతుందో అని దేవతలు నిశ్చేష్టులై చూస్తున్నారు. ఉన్మత్తులై రాక్షసులు మోహిని సౌందర్య విలాసాలను చూస్తూ తన్మయులౌతున్నారు.

దేవతలు కూడా జగన్మోహిని ఎవరో మొదట తెలుసుకోలేక పోయినా, రాక్షసులను మభ్యపెట్టి అమృతాన్ని దేవతలకు మాత్రమే పోస్తున్నప్పుడు, ఆ విశ్వమోహిని విష్ణువే అని గ్రహించి, గుట్టుచప్పుడు కాకుండా అమృతాన్ని తాగుతున్నారు.



జగన్మోహినీ విలాసమంతా విష్ణువు చిద్విలాసమే అని తెలిసిన దేవతలు, నిర్లిప్తంగా అమరత్వం పొందుతూంటే, దైత్యులు జగన్మోహిని మోహజాలంలో పడి ఉన్మత్తులై అమృతాన్ని కోల్పోయారు.

జగన్మోహిని వంచన చేస్తున్నదని రాహువు అనే ఒకే ఒక తెలివైన రాక్షసుడు కనిపెట్టాడు. అతడు జలరాక్షసి సింహిక కుమారుడు, బహు మాయావి.

జరుగుతూన్న మోసాన్ని చెప్పినా వినిపించుకొనే స్థితిలో రాక్షసులు లేక పోవడం జూసి, రాహువు దేవతల రూపు ధరించి దేవతల వరుసలో చేరి, అమృతాన్ని త్రాగాడు. సూర్యచంద్రులు అది గమనించి, మందర పర్వతాగ్రంపై విష్ణువుగానే ఉన్న బహురూపియైన విష్ణువుతో చెప్పారు. విష్ణువు తన చక్రాన్ని రాక్షసుడిపైకి పంపాడు.

రాహువు చక్రాన్ని తప్పించుకోవాలని గ్రహాలు తిరిగే అంతరిక్షానికి ఎగిరాడు. విష్ణుచక్రం వెంబడించి రాక్షసుడి తలను ఖండించి, తలనూ మొండేన్నీ వేరు చేసింది. అమృత ప్రభావం వల్ల తలా, మొండెమూ రెండూ సజీవంగా ఉండి తల రాహువుగా, మొండెం కేతువుగా రెండు గ్రహాలుగా మారి, గ్రహకూటమిలో



ధన్వంతరి అమృతంతోబాటు ఓషధులనూ, ఓషధీవేదాన్ని తెచ్చాడు. ధన్వంతరి వైద్యశాస్త్రానికి అధిదేవతగా, వైద్యుల కులదైవంగా అర్చింపబడ్డాడు.

జగన్మోహిని విశ్వమోహినిగా కీర్తించబడి సౌందర్య విలాసాలకు ప్రమాణంగా చెప్పుకోబడింది.

నారదుడు జగన్మోహిని అవతారాన్ని కీర్తిస్తూ, జగన్మోహినీ రాగం మహతివీణపై పలికిస్తూ, కైలాసానికి వెళ్ళాడు. పార్వతి అది విని, "పామరులైన రాక్షసులను వంచించగలిగినంత మాత్రాన జగన్మోహిని అనిపించుకుంటుందా?" అని అన్నది.

"ఔనమ్మా, ఎంతటివారినైనా రంజింపజేసి యీ విశ్వాన్నే ఉర్రూగించే విశ్వమోహిని!" అని అంటూ నారదుడు వెళ్ళాడు..

పార్వతి ఆ విషయాన్ని శివుడితో చెప్పింది. శంకరుడు చిరునవ్వుతో ఆలకించి ఊరుకున్నాడు. తరువాత పార్వతితో కలిసి నందివాహనంపై వైకుంఠానికి వెళ్ళి, విష్ణువుతో, "నీ జగన్మోహినీ అవతారాన్ని మరొకసారి చూపుతావని వచ్చాము!" అన్నాడు.

"ఏదో అవసరానికి ఏ వేషమైనా వెయ్యక తప్పదు గదా! నీలాంటి వాడి ముందర అదేమాత్రం లెద్దూ!" అని

చేరాయి. రాహుకేతు గ్రహాలతో గ్రహాలు తొమ్మిది అయ్యాయి.

సూర్యచంద్రులపై కసితో అమావాస్య, పూర్ణిమ పర్వదినాలలో, రాహుకేతువులు వారిని పట్టి పీడించ సాగారు. ఆ విధంగా సూర్యచంద్ర గ్రహణాలు ఏర్పడ్డాయి.

అమృతాన్నంతా దేవతలకు యిచ్చి జగన్మోహిని అంతర్ధానమైంది. రాక్షసులు తమ తెలివిమాలినతనానికి చింతించి, అప్పట్నించి విష్ణువుకూ, దేవతలకూ బద్ధశత్రువులైనారు.

అమృతమథన సందర్భంగా విష్ణువు కూర్మావతారాన్నీ, ధన్వంతరి అవతారాన్నీ, జగన్మోహినీ అవతారాన్నీ ధరించాడు.

అంటూ విష్ణువు మాట్లాడుతూనే అంతర్ధానమయ్యాడు.

అంతలో అల్లంత దూరాన పూల బంతితో ఆడుతూ, పాడుతూ జగన్మోహిని కనిపించింది. శివుడు సర్వమూ మరిచి ఆమె వెంట పడ్డాడు. జగన్మోహిని అందకుండా విశ్వాకాశంలోకి దారి తీసింది. శివుడు చేతులుచాచి వెంట పడుతున్నాడు. పార్వతి నిర్విణ్ణురాలై చూస్తూండిపోయింది.




శివమోహినీ లీలావినోదాన్ని బ్రహ్మాది దేవతలు కన్నుల పండుగగా తిలకిస్తున్నారు. నంది నివ్వెరపోతున్నాడు. నారదుడు మహతి వీణపై శివరంజని రాగాన్ని మారుమ్రోగిస్తున్నాడు.

ముందు జగన్మోహినీ, వెనుక శివుడూ విశ్వాంతరాల్లోకి పరుగులు తీస్తూ కొంత సేపటికి కనిపించలేదు. పార్వతి కైలాసం చేరుకుంది.

జగన్మోహిని తేజోమండలాల మధ్య నుంచి దూసుకుపోతూ శివుణ్ణి విశ్వమంతా తిప్పి, తిప్పి, కైలాసానికి చేరుతూ, తన్ను తాకవద్దని శివుణ్ణి వారిస్తూ పార్వతి చెంతకు చేరుతూండగా, శివుడు ఆమె నడుము చుట్టి మోకరిల్లాడు.

"చూశావుటమ్మా, నీ ప్రాణేశ్వరుడి ఆగడం!" అని అంటూ జగన్మోహిని శివుడు ఇంకేమి చేస్తాడో అని భయపడుతూ పార్వతి చెంత నిల్చింది.

వెనువెంటనే జగన్మోహినీ రూపాన్ని చాలించి విష్ణువు పార్వతి ఎదుట సాక్షాత్కరించాడు.

"అన్నా! నీవు విశ్వమోహన జగన్మోహినీ కేశవస్వామివి! అంతా మీ శివకేశవుల లీలా నాటకమే కద!" అని పార్వతి విష్ణువుతో అన్నది.

"అంతేనమ్మా, అంతే లే!" అంటూ నారదుడు మహతి వాయించుతూ అక్కడికి వచ్చి జగన్మోహిని, శివరంజని రాగాల్లో హరి, హరుల లీలావిలాసాన్ని గానం చేస్తూ ముల్లోకాలూ తిరిగాడు.



శివుడు విష్ణువుతో, "అమృతం సంగతే మరిచి, నీ జగన్మోహినీ విలాసాన్ని కళ్లారా గోలిన రాక్షసుల్ని మెచ్చుకుంటున్నాను! రసపిపాస అసురుల సొత్తు!" అని అన్నాడు.

విష్ణువు చిరునవ్వు నవ్వి పార్వతితో, "అమ్మా, మున్ముందు శివరంజనిగా మా గంగాదేవి దివి నుండి భువికి అవతరించే వేళ కూడా, ఈ మహాశివుడు ఇలాగే పరవశించిపోతూ నీకు సవతిని తెచ్చేలా గుంది!" అని అంటూ అంతర్ధానమై వైకుంఠానికి చేరాడు.

తరువాతి కాలంలో విష్ణువు కర్దమ ప్రజాపతికి, దేవహూతికి పుత్రుడుగా కపిలావతారం ఎత్తాడు. చిన్నతనం నుంచే గొప్ప జ్ఞానసంపన్నుడై తపస్సు చేసి కపిల మహామునిగా పేరు పొందాడు.

కపిలుడు తల్లి దేవహూతికి చెప్పిన అనేక తత్వబోధలు సాంఖ్యయోగంగా ప్రసిద్ధి పొందింది. కపిలమహర్షి పాతాళంలో ఒక గుహలో తపస్సు నిర్విరామంగా చేస్తూన్న కాలంలో, భూమ్మీద నగర చక్రవర్తి నూరవ అశ్వమేధ యాగాన్ని తలపెట్టాడు. ఇంద్రుడు యాగాశ్వాన్ని మాయచేసి కపిలమహర్షి తపస్సు చేస్తున్న గుహలో దాచాడు.

సగరుడి వెయ్యి మంది కుమారులు గుర్రాన్ని వెతుకుతూ పాతాళానికి బిలం త్రవ్వుకొని వెళ్ళి, కపిలమహర్షి గుహలో చూశారు. కపిలుడే గుర్రాన్ని అపహరించి దాచి, దొంగజపం చేస్తున్నాడని విరుచుకు పడ్డారు. కపిలుడు కళ్ళు తెరిచి చూసే సరికి వారంతా బూడిద అయ్యారు.

ఆ భస్మరాసులపై విష్ణుపాదాల నుండి పుట్టి స్వర్గంలో మందాకినిగా ప్రవహిస్తున్న గంగను ప్రవహింపజేసి పితరులను తరింపజేయడానికి సగరుడి మునిమనమడైన భగీరథుడు గొప్ప తపస్సు చేసి; గంగాదేవిని ప్రసన్నం చేసుకున్నాడు. గంగధాటిని తట్టుకొని భరించగల శివుణ్ణి తపస్సుతో ప్రసన్నం చేసుకున్నాడు.

గంగావతరణంలో శివుడు గంగాదేవిని చూసి పరవశించి గంగను తన జటా జూటంలో గాఢంగా బంధించేసుకున్నాడు. తరువాత భగీరథుడి ప్రార్థనపై ముడి సడలించి కొద్దిగా గంగను వదిలాడు. గంగ భగీరథుడి వెంట వెళ్ళి, అతని పితరుల భస్మరాసులపై ప్రవహించి తరింపజేసింది.

పరమశివుడు గంగాధరుడై రంజిల్లాడు. ఆ విధంగా గంగ పార్వతికి సవతి అయింది.

సనకసనందనాది మునులు అనబడే సనకుడు, సనందుడు, సనత్సుజాతుడు, సనత్కుమారుడు అనే నలుగురూ బ్రహ్మ మానసపుత్రులు. ఎప్పుడూ బాలురవలెనే ఉంటారు. విష్ణుభక్తి తత్పరులై విష్ణువును కీర్తిస్తూ, అన్నిలోకాలూ నిరాటంకంగా తిరుగుతూంటారు.

వారు విష్ణువును చూడగోరి వైకుంఠానికి వెళ్ళారు. అన్ని ద్వారాలూ దాటి విష్ణు మందిర ద్వారం చేరుకున్నారు.

అక్కడ విష్ణువుతో సరిసమానమైన రూపంతో నాలుగు చేతులతో శంఖ, చక్ర, గద, అభయ ముద్రలు పట్టి ద్వారపాలకులై ఉన్న జయుడు, విజయుడు ఇది సమయం కాదని మునులను వారించారు.

సనకసనందనాదులు, "మాకు విష్ణు సందర్శనానికి సమయా సమయాలు లేవు," అంటూ జయవిజయులను లక్ష్య పెట్టకుండా విష్ణుమందిరంలోనికి వెళ్ళబోతూంటే, ద్వారపాలకులు గదలు ఎత్తి వారిని అడ్డగించారు.

సనకాది మునులు, "మీరు విష్ణు ద్వారపాలకులుగా ఉండతగరు రాక్షసులై పుట్టండి!" అని శపించారు.

ద్వారం దగ్గిర కలకలం విని, లక్ష్మి వెంట రాగా విష్ణువు తలుపులు తెరుచుకొని అక్కడికి వచ్చాడు.

జయవిజయులు మునులు తమకిచ్చిన శాపాన్ని చెప్పుకొని ఆక్రోశించారు. మునులు తొందరపడి శపించినందుకు లోలోన చాలా విచారించారు.






# కాజీ చేసిన మోసం

చాలా కాలం క్రితం ఘజ్నీ నగరాన్ని సుల్తాన్ మహమ్మద్ పాలిస్తూ ఉండగా ఒక వర్తకుడు అజర్‌బైజాన్ నుంచి హిందూదేశానికి ప్రయాణమై వస్తూ, ఘజ్నీనగరం చేరాడు. ఆ నగరం అతనికి అన్ని విధాలా ఎంతో నచ్చింది; అందుచేత అక్కడే స్థిరపడి తన వృత్తి అయిన వర్తకం చేసుకుందామని నిశ్చయించుకున్నాడు. వర్తకం బాగా అనుకూలించగా అతను కొద్ది కాలంలోనే సంపన్నుడై, మంచి అందమూ, సుగుణ సంపత్తీ గల కన్యను వివాహమాడి సుఖంగా జీవించసాగాడు.

కొంతకాలం జరిగింది. అతని వర్తకం దినదినాభివృద్ధి చెందింది. క్రమంగా అతని సరుకులు హిందూదేశానికి కూడా ఎగుమతి అయాయి. తరవాత అతను స్వయంగా హిందూదేశానికి వెళ్ళి వర్తకపు వ్యవహారాలు చక్కబెట్టవలసిన అవసరం ఏర్పడింది.

తాను చెయ్యనున్నది దీర్ఘప్రయాణం. దాదాపు ఒక యేడాదిపాటు తన భార్యను ఎవరి వద్దనైనా ఉంచాలంటే నగరంలో తనకు బంధువులెవరూ లేరు.

నగరంలో ఒక కాజీ ఉన్నాడు. ఆయన చాలా నీతిపరుడూ, మహా పవిత్రుడూ అయిన న్యాయాధికారి అని చెప్పుకునేవారు. అందుచేత వర్తకుడు ఆ కాజీ వద్దకు వెళ్ళి, "తమరు ధర్మమూర్తులని లోకమంతా చెప్పుకుంటున్నది. నేను వ్యాపారం మీద ఒక సంవత్సరం పాటు దేశాంతరాలకు పోతున్నాను. అంత కాలమూ నా భార్యను మీ యింట ఉంచుకుని కాపాడప్రార్థన. ఆమెకయే ఖర్చు ఇచ్చి మరీ బయలుదేరుతున్నాను," అన్నాడు.



అందుకు కాజీ సంతోషంగా ఒప్పుకున్నాడు. వర్తకుడు తన భార్యను కాజీ ఇంట వదిలి వెళ్లిపోయాడు.

వర్తకుడి భార్య సంవత్సరం పాటు కాజీ ఇంట దైవధ్యానం చేస్తూ ఎలాటి దుర్ఘటనలూ లేక గడిపేసింది. కాని అంతలో కాజీ ఆమెను చూడటం జరిగింది. ఆమె అందం చూసి, కాజీకి దిగ్భ్రాంతి కలిగింది. అతని సద్బుద్ధి కాస్తా హరించుకుపోయింది. వర్తకుడి భార్యను ఎలాగైనా వంచించాలన్న దుర్బుద్ధి బలంగా తలఎత్తింది.

ఒకనాడు కాజీ భార్య ఇంటిని వర్తకుడి భార్యకు అప్పగించి, ఎక్కడికో వెళ్లింది. ఈ సంగతి కాజీకి ముందే తెలిసి, అతను వేళగానివేళ ఇంటికి తిరిగి వచ్చాడు. అతను తిన్నగా వర్తకుడి భార్య వున్న గదిలోకి వెళ్ళి, ''నేను ఎంతో పాపభీతిగలవాడిననీ, ధర్మచింతగలవాడిననీ, లోకమంతా ఎరుగును గదా? నా ఎదటపడటానికి ఎందుకు నీకు సంకోచం? నన్ను చూసి భయపడడం అన్యాయం,'' అన్నాడు.

ఈ మాటలతో వర్తకుడి భార్యకు కొంత ధైర్యం వచ్చింది.

''నాకు చాలా ఆకలిగా వున్నది. కాస్త భోజనం పెడతావా?'' అని కాజీ వర్తకుడి భార్యను అడిగాడు.

ఆమె కాజీకి వడ్డన చేసి అవతలికి వెళ్ళింది. అప్పుడు కాజీ తన వద్ద వున్న మత్తుమందు తీసి ఆహారంలో కలిపి వర్తకుడి భార్యను పిలిచి, ''అమ్మాయీ, నన్ను ఒంటరిగా తినమన్నావా? ఏకాంత భోజనం మహాదోషం అంటారు. నాకు ఆ దోషం కలగకుండా, నాతోబాటు లాంఛనగా నువు కూడా ఒక ముద్ద తిను మరి!'' అన్నాడు.

పెద్దవాడి మాట తీసెయ్యటం మర్యాద కాదని వర్తకుడి భార్య, కాజీ అందించిన ముద్దలు రెండు తిని, స్పృహతప్పి పడిపోయింది.

సరిగా అదే క్షణంలో ఇంటికి ఎవరో వచ్చిన అలికిడి అయింది. తాను చేసిన పాపిష్టిపనికి అసలే దిమ్మరపోయి ఉన్న కాజీ, మరింత కంగారుపడి, వర్తకుడి భార్యను తీసుకుపోయి, తన ధనమూ, నగలూ దాచి ఉంచే మాళిగలో పెట్టి ఇవతలికి వచ్చాడు.

ఈ లోపల కాజీ భార్యా, పిల్లలూ ఇంట్లోకి వచ్చారు. కాజీ ఆమెను చూస్తూనే కోపం అభినయిస్తూ, "ఇల్లు గాలికి వది లేసి ఎక్కడికి వెళ్ళావు?" అని అడి గాడు.

"ఇల్లు చూస్తూ ఉండమని వర్తకుడి పెళ్ళానికి చెప్పి వెళ్ళానే?" అన్నది కాజీ భార్య భయపడుతూ.

"నేను వచ్చి రెండు గంటలయింది. కొంపలో ఎవరూ లేరు. ఎవరిని పడితే వారిని నమ్మవచ్చా? ఏమేం పోయాయో ఏమిటో?" అన్నాడు కాజీ. కాజీ భార్యా, పిల్లలూ ఆశ్చర్యపోయారు. వర్తకుడి భార్య ఎంత మంచిదో వారికి పూర్తిగా తెలుసు.

వీళ్ళు ఇలా మాట్లాడుకుంటూ ఉండ గానే వర్తకుడు కూడా వచ్చాడు. హిందూ దేశం నుంచి అతను ఆ రోజే తిరిగి వచ్చాడు.

"నా భార్యను తీసుకుపోవటానికి వచ్చాను," అన్నాడు వర్తకుడు కాజీతో.

"నీ భార్య చెప్పా పెట్టకుండా ఎటో వెళ్ళిపోయింది," అన్నాడు కాజీ.





"కాజీగారు హాస్యమాడుతున్నారు. నా భార్యను పిలవండి," అన్నాడు వర్తకుడు.

"హాస్యమేమీలేదు. నిజమే చెబుతున్నాను," అన్నాడు కాజీ.

"నా భార్య అలాటి పని ఎన్నడూ చెయ్యదు. ఇందులో ఏదో మోసం ఉన్నది," అన్నాడు వర్తకుడు.

కాజీ కోపం అభినయిస్తూ, "మతిమాలినవాడా, అన్యాయం జరిగినది నాకు! అకారణంగా నన్ను నిందించక, నీ భార్య ఏమయిందో, ఏ దేశాలు పట్టిపోయిందో వెతుక్కో!" అన్నాడు.

వర్తకుడు సుల్తాను వద్దకు వెళ్ళి, జరిగినది చెప్పి, కాజీ మీద ఫిర్యాదు తెచ్చాడు.

సుల్తాను కాజీని పిలిపించి, జరిగినదేమిటో అతణ్ణి చెప్పమన్నాడు.

మూడు నెలల క్రితమే వర్తకుడి భార్య తన ఇంటి నుంచి చెప్పకుండా వెళ్ళిపోయిందనీ, ఆ తరవాత ఎంత ప్రయత్నించినా ఆమె ఆచూకీ ఎక్కడా దొరకలేదనీ కాజీ సుల్తానుకు విన్నవించుకున్నాడు.

"నా భార్య అలా ఎన్నటికీ చెయ్యదు. కాజీ చెప్పేది అబద్ధం," అన్నాడు వర్తకుడు.

సాక్షులుంటే పట్టుకురమ్మని సుల్తాను కాజీని ఆదేశించాడు. కాజీ వెళ్ళి, తన ఇరుగుపొరుగున ఉన్న పనికిమాలిన వాళ్ళకు లంచం పెట్టి, సాక్షులుగా తెచ్చాడు. వాళ్ళంతా కాజీ చెప్పమన్నట్టే సాక్ష్యం చెప్పారు. సుల్తాను వర్తకుడి ఫిర్యాదును తోసి పుచ్చాడు. వర్తకుడు హతాశుడై పోయాడు.

సుల్తాను మహమ్మదు కొక అలవాటుండేది. ఆయన సామాన్యపౌరుడి దుస్తులు ధరించి, వీధులవెంట తిరుగుతూ, ప్రజలు అనుకునేది వినేవాడు. అలాగే ఆయన ఆ రాత్రి నగరం పర్యటించసాగాడు. ఆయన ఒక దుకాణం దగ్గిరికి వచ్చేసరికి అక్కడ కొందరు కుర్రవాళ్ళు ఆడుకుంటున్నారు. వాళ్ళు ఒకణ్ణి రాజు చేసి,

"ఒరే నువు సుల్తాన్ మహమ్మద్ లాగా తీర్పులు చెప్పావంటే, నిన్ను పదవినించి దించెయ్యగలం, జాగ్రత్త!" అన్నారు.

సుల్తాను ఆ మాట విని నిర్ఘాంతపోయి, ఆ మాట అన్న కుర్రవాడితో, "సుల్తాన్ మహమ్మద్ తీర్పులు సరిగా ఉండవా ఏం?" అన్నాడు.

"ఇవాళ సుల్తాన్ ఇచ్చిన తీర్పు ఏమిటి? కాజీ తెచ్చిన సాక్షులు ఎటువంటివాళ్ళు? బుద్ధిగలవాడెవడన్నా వాళ్ళ సాక్ష్యం నమ్ముతాడా?" అన్నాడు కుర్రవాడు.

మర్నాడు ఉదయం ఆయన ఆ కుర్రవాణ్ణి తన ఇంటికి పిలిపించి, "ఇవాళ తీర్పులు చెబుదువు గాని!" అన్నాడు.

కుర్రవాణ్ణి న్యాయపీఠం మీద కూర్చోబెట్టారు. కిందటి రోజు కాజీ పక్షాన సాక్ష్యం చెప్పినవారిని ఒక్కొక్కరినే పిలిచి, ఆ కుర్రవాడు, "నువు వర్తకుడి భార్యను చూశావా? ఆమె వయసెంత? మనిషి ఎలా వుంటుంది?" అని ప్రశ్నించాడు.

సాక్షులు వర్తకుడి భార్యను చూశామన్నారేగాని, ఆమె వయసూ, వర్ణనా ఒకరు చెప్పినట్టు ఒకరు చెప్పలేదు.

"మీరు నిజం చెబుతారా? కొరత వేయించాలా?" అని కుర్రవాడు సాక్షులను అడిగాడు.

వెంటనే వాళ్ళంతా కుర్రవాడి కాళ్ళ మీద పడి, తమకు ఏమీ తెలియదనీ, కాజీ చెప్పమన్నట్టు సాక్ష్యం చెప్పామనీ ఒప్పుకున్నారు.

ఆ తరవాత కాజీ నిజం చెప్పక తప్పలేదు. వర్తకుడి భార్యను రహస్యమాళిగ నుంచి రక్షించి, వర్తకుడికి కిప్పించారు. సుల్తాను కాజీకి దేశబహిష్కరణ విధించి, అతని ఆస్తిని వర్తకుడి భార్యపరం చేశాడు.

తాను చెయ్యలేకపోయిన న్యాయం చేసిన కుర్రవాణ్ణి సుల్తాను తన ఇంటనే వుంచుకుని, బాగా చదివించి, కాలక్రమాన తన ముఖ్య సలహాదారుగా వేసుకున్నాడు.



## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1983 జూన్ నెల సంచికలో ప్రకటింపబడును.







Devidas Kasbekar

P. R. Shinde

★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్కమాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.)

★ ఏప్రిల్ నెల 20 వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరవాత చేరే వ్యాఖ్యలు ఎంతమాత్రమూ పరిశీలింప బడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/–లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, (వ్యాఖ్యలకు సంబంధించని విషయాలేవీ చేర్చరాదు.) ఈ అడ్రసుకు పంపాలి :– చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

## ఫిబ్రవరి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : ఎంత కాలం తోడిది?

రెండవ ఫోటో : ఎవరి భారం వారిది!

పంపినవారు : సిరిసిల్లా రషీద్, దోమకొండ, నిజామాబాద్ (ఆం. ప్ర)

బహుమతి మొత్తం రు. 50/–నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 188, Arcot Road, Madras-600 026 (India). Controlling Editor: NAGI REDDI.

చుక్కలు వేసిన గీత వెంట కత్తిరించండి.

ప్రవేశ రుసుము లేదు

# చందమామ కేమెల్
## రంగుల పోటీ

**బహుమతులు గెలవండి**
**కేమెల్**

1 ప్రథమ బహుమతి రూ. 15/-
3 రెండవ బహుమతి రూ. 10/-
10 మూడవ బహుమతి రూ. 5/-
10 సర్టిఫికెట్లు

ఈ పోటీలో 12 సంవత్సరాల లోపల వయస్సు కల పిల్లలు పాల్గొనవచ్చు.

పైన చూపించబడిన చిత్రాన్ని పూర్తిగా కేమెల్ రంగులతో నింపి దిగువ చిరునామాకు పంపండి:

పో. బా. నం. 9928 కొలాబా, బొంబాయి-400 005.

న్యాయనిర్ణేతలదే చివరి నిర్ణయం. దీనికి అందరూ కట్టుబడాలి. ఈ సంబంధంగా ఎలాంటి పత్ర వ్యవహారాలు జరుపబడవు.

Name:........................................Age:..................

Address:..................................................

..................................................

ఈ తేదీ లోపల ఎంట్రీలను పంపండి: 30-4-1983

**CONTEST NO 30**

Vision/CPL 83032 Tel.

**Results of Chandamama—Camlin Colouring Contest No. 27 (Telugu)**

*1st Prize:* Thakur Vijay Singh, Almarpet. *2nd Prize:* Gireesh Vasant Chiddarwar, Yeetmal. L. Vani, Kurnool. K. Sineesha, Hyderabad-500 073. *3rd Prize:* M. Pentaiah, Gudur. P. U. Bhakthavathsala Sharma, Chickballapur-562 101. Ch. Srinivasu, Peddakaparthy. M. Yugandhar Varaprasad, Madras-17. G. J. R. Nath, Hyderabad. T. Reddi Sekhar,

# న్యూట్రమూల్ శక్తి.

## ఛాంపియన్లు ఎంచుకునేది యిది.

న్యూట్రమూల్. సమృద్ధి అయిన అమూల్ పాలు, ఎంచిన మాల్ట్, ఆరోగ్యాన్నిచ్చే విటమిన్లు, పుష్టినిచ్చే ప్రోటీన్లు, అత్యవసరమైన ఖనిజాలు, ఉల్లాసాన్నిచ్చే చాక్లెట్... యివన్నీ గూడా బోర్నవిటా, బూస్ట్, మాల్టోవా కన్నా చాలా తక్కువ ధరలో. మర్తో విషయం గుర్తుంచుకోండి, కేవలం న్యూట్రమూల్‌కే ఐ ఎస్ ఐ నాణ్యతముద్ర వుంది.







మరింత పొడుగ్గా,
బలంగా, పుష్టిగా అవడం ఎలా?
కనివిని ఎరుగని శక్తినిచ్చే పుస్తకపు కానుక:

To: Nutramul, P.O. Box 10148, Bombay 400 001. rr

ప్రియమైన న్యూట్రమూల్,
దయయుంచి నాకు దారాసింగ్ గారి 'హైట్ ఇన్‌క్రీజ్ స్ట్రెంగ్త్ అండ్ ఫిట్‌నెస్' పుస్తకం పంపించండి. నేను రు. 1-50 పోస్టేజి స్టాంపులూ, న్యూట్రమూల్ 500 గ్రా. డబ్బా కొన్న క్యాష్ మెమోనీ జతపరుస్తున్నాను. సరుకు సరుకు వున్నంతవరకే యీ కానుక అని నాకు తెలుసు.

పేరు ______________ (పెద్ద అక్షరాలలో)

అడ్రసు ______________



మార్కెట్ చేయువారు:
గుజరాత్ కో-ఆపరేటివ్ మిల్క్ మార్కెటింగ్ ఫెడరేషన్ లి.
ఆనంద్ 388 001

daCunha/GCM/76/TL/82

READY, STEADY, GO!





WITH

# Jalans SCHOOL BAG

* It is for you, light as you wanted it to be, but roomy enough for all your books, tiffin box, pencil box and even comics.

Created in colours of Cherry Navy blue, Green..........to match your School Uniform and likes. Carry it anywhere you want after school to swim, picnics or even a short holiday.

like it? Now get your folks to present you one on your birthday.

* INDIA'S First Moulded School Bag made for you by—






**SHREE LAXMI ENTERPRISES**

2, LALBAZAR STREET, CALCUTTA-700 001

ZOREX/10




We're all in it together
for the fun of it,
for the taste of it!

CAMPA ORANGE FLAVOUR – IT'S THE FLAVOUR OF FUN!

DBM/5361